
BSA LADYBIRD
Your best friend for life.
www.ticyclesindia.com


Introducing
BSA LADYBIRD XS
Act Create Play
Push your boundaries and explore new horizons. Because with the all-new Ladybird XS you can go wherever you want to. The perfect combination of stylish, feminine looks and a strong, rugged frame, it's the right companion for girls who believe in having the best of every world.
Bring home a Ladybird XS and bring out the adventurer in you.

2

25% Off!

CHANDAMAMA'S

# Ramayana

*An Epic Journey*








**Follow the epic journey of Prince Rama, from his birth to his exile, from the abduction of his wife, Sita, to his great war with the Asura King, Ravana, in Chandamama's latest offering: Ramayana - An Epic Journey.**

**Price: Rs 449/-**
**Order now and get 25 % off!**

**To place an order go to www.chandamama.com and click on the Pre-order button.**

**Chandamama's Ramayana is available only in English at all leading book shops.**

చందమామ సంపుటి: 62 జనవరి 2009 సంచిక:01

## ఈ నెల విశేషాలు













## ఈ సంచికలో ...





## అమరవాణి

సమర్థుడికి అతి భారం ఏమున్నది? కార్యదక్షుడికి దూరం ఏమిటి? విద్య గల వాడికి విదేశ మేమిటి? మంచిగా మాట్లాడేవాడికి శత్రువు ఎవరు?

★★★

లోకంలో ఎవరూ ఎవరికీ స్వభావంవల్ల మాత్రమే గొప్పవారూ, చెడ్డవారూ అనిపించరు; మనుషుల గొప్పతనమూ, అల్పత్వమూ వారు చేసే పనుల వల్లనే కలుగుతుంది.



# యువతకు మేలుకొలుపు

**"లే,** మేలుకో, గమ్యం చేరే వరకు ఆగవద్దు!" అనే స్వామి వివేకానంద ఉత్తేజభరితమైన మేలుకొలుపును తరచూ ఉటంకిస్తూ ఉంటాం. 1883వ సం. చికాగోలో జరిగిన విశ్వమత సమ్మేళనంలో స్వామి వివేకానంద ఈ ఉపనిషద్వాణిని వినిపించాడు. విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రపంచానికి చాటుతూ యువతకు ఆయన ఈ పిలుపునిచ్చాడు. విభిన్న మతాలకు జన్మనిచ్చిన భారత దేశ పౌరుడిగా-భారతీయుల విశ్వాసానికి పునాదిగా వెలుగొందే పరమత సహనాన్ని కూడా స్వామి వివేకానంద ఆ సమ్మేళనంలో చాటి చెప్పాడు.

అయితే, ఇటీవలి కాలంలో మన సొంత గడ్డపై జరిగిన ఉగ్రవాద దురాగతాలు భారతీయ స్ఫూర్తినే పరిహసించే విధంగా ఉన్నాయి. తమ మతం ప్రబోధించే ప్రాథమిక సూత్రాలను సైతం పాటించకుండా కొందరు దారుణమైన హింసాత్మక దురాగతాలకు పాల్పడుతున్నారు. ఈ ఉగ్రవాద చర్యలలో పాల్గొన్న పలువురు, యువకులుగా ఉండడం మరింత వేదన కలిగించే విషయం. దుష్టుల చేతుల్లో పావులుగా మారిన దారి తప్పిన అమాయక యువకులుగానే వారిని భావించాలి. అలాంటి వారిని దారిలో పెట్టడం మన కర్తవ్యం!

2008వ సం.లో అంతర్జాతీయ క్రీడారంగంలో అభినవ్ బింద్రా, సోనియామీర్జా, విశ్వనాథన్ ఆనంద్ మొదలైనవారు అద్భుతమైన విజయాలు సాధించారు. మన దేశం చంద్రమండలానికి పంపిన చంద్రయాన్-1 ఉపగ్రహం అంతరిక్ష సాంకేతిక పరిజ్ఞానంలో మనదేశం సాధించిన అద్భుత ప్రగతికి నిదర్శనం. ఇవన్నీ ప్రతి భారతీయుడూ గర్వించ తగ్గ అపూర్వ విజయాలు!

అయినా సంవత్సరం చివర జరిగిన హింసాత్మక దుర్ఘటనలు ఆ విజయోత్సాహాన్ని విషాద మేఘాల్లా కమ్ముకున్నాయి. ఉపఖండంలో శాంతి సామరస్యాలకు విఘాతం కలిగంచడానికి ప్రయత్నిస్తున్న విచ్ఛిన్నకర శక్తులను రూపుమాపడానికి యువతలోని సానుకూల శక్తులను సమీకరిద్దాం. అందుకు దోహదపడే విధంగా భారతజాతి పునరుజ్జీవనానికి యువతకు పిలుపునిచ్చిన స్వామి వివేకానంద జన్మదినమైన జనవరి 12వ తేదీన యువజన దినోత్సవం జరుపుకుంటున్నట్టే 2009ని యువజన సంవత్సరంగా జరుపుకుందాం. స్వామి వివేకానంద వంటి మహనీయుల ఆశయాలను నెరవేరుద్దాం. వారికి తగినవారసులమని నిరూపిద్దాం!

సంపాదకుడు : **విశ్వం**

**Visit us at : http://www.chandamama.com/telugu**





**Founded by**
**B. Nagi Reddi and Chakrapani**

*Editor, Publisher :* B. Viswanatha Reddi (Viswam)
*Chief Executive Officer :* L. Subramanyan
*Consultant Editor :* K. Ramakrishnan
*Associate Editor :* A.R. Balasubrahmanyam
*Senior Artists:* K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
*Artist :* Jayapandian
*Assistant Editor :* R. Sudha
*Creative Writer :* R. Vaasugi
*Layout Designer :* B.A. Hemalata Malini

*CIRCULATION TEAM :*
*Chennai :* T N Ravi Shankar, *National Sales Manager*
Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
Fazal Khan, *Manager-Circulation & Institutional Sales - South*
Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
*Mumbai :* Rajendra K Jadhav, *Asst. Manager - Circulation*
Mobile +91 9320565048
**CHANDAMAMA INDIA LTD.,** B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
*New Delhi :* Sushil Sharma, *Circulation Manager-North*
Mobile +91 98719 30767
**CHANDAMAMA INDIA LTD.,** Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
*Bangalore :* P. Murali, *Asst. Circulation Manager - Karnataka*
Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
*Kolkata :* Ananth Prakash, *Circulation Manager-East*
Mobile +91 98362 82202
email : ananth.prakash@chandamama.com
*Ahmedabad :* Kalpesh Raval, *Sales Officer-Circulation*
Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
*Content Head - Online :* Sowmya Bharadwaj
email : sowmya.b@chandamama.com
*Head - Business Development :* Surajit Agarwal
email : surajit@chandamama.com
*Advertisement :* email : sales@chandamama.com
*Subscription Queries:* L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
*Customer Cell :* A B Sairam Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
*Production Executive :* Panchakshari R Math
*Head Office :* **CHANDAMAMA INDIA LTD.,**
2/513 (Old 3/396), Sandeep Avenue East, 2nd Main Road,
Chinna Neelankarai, Chennai - 600 041
Phone +91 44 32402323
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

**ANNUAL SUBSCRIPTION :**
Foreign : US$30 (including shipping and handling charges)

# పాఠకుల లేఖలు



చందమామ డిసెంబర్ సంచికలో విశ్వం గారి సంపాదకీయం చదవగానే బాధ కలిగింది. చందమామతో పాటు పాఠకులతో కూడా విడదీయ లేని, తెలియని అనుబంధాన్ని పెంచుకున్న విశ్వం గారి వీడ్కోలు బాధనే కలిగించింది. యువత ఎప్పుడూ మార్పునే కోరుకుంటుంది. ఆ మార్పు పాత కొత్తల మేలు కలయికగా ఉండాలి. ఓల్డ్ ఈజ్ గోల్డ్, పెద్దలమాట చద్ది అన్నం మూట అన్న చందాన విశ్వం గారు కొత్త సంపాదకులకు తమ చేయూతనిచ్చి చందమామను వినూత్నమైన పత్రికగా పాఠకులకు అందిస్తారని ఆశిస్తున్నాను. బుల్లితెర తాకిడిలో పుస్తక పఠనం తగ్గినప్పటికీ చందమామ పాఠకులు మాత్రం ప్రతినెలా పత్రిక కోసం ఎదురు చూస్తూనే ఉంటారు. విశ్వంగారికి నమస్సులతో,

-వేదుల పార్వతి
హైదరాబాద్ - **500 080** (ఆం.ప్ర)

మన చందమామ డిసెంబర్ నెలతో 61 సం.లు పూర్తి చేసుకుని 62లోకి అడుగు పెడుతూన్న శుభసంద ర్భంలో మరో వెయ్యేళ్ళు పాఠకలోకాన్ని ఇలాగే అలరించాలని హృదయ పూర్వకంగా కోరుకుంటూ, అభినందనలతో,

-పి. శ్యామసుందరి
నెల్లూరు - **524 002**(ఆం.ప్ర)

తెలుగు భాషకు ప్రాచీన హోదా కల్పించడం ఆనంద దాయకం. బాలల మానసిక వికాసానికి తోడ్పడేలా చందమామను వెలువరిస్తూన్న చందమామ సంపాద కులకూ, చిత్రకారులకూ, యాజమాన్యానికీ, అంద రికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు.

-ఎన్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి
బొబ్బిలి - **535 557** (ఆం.ప్ర)



# కలియుగ కల్పవృక్షం

కొండపాలెంలోని గోవిందుడు నా అన్న వాళ్ళు లేని అనాథ. అతడు ఒకనాడు బతుకు తెరువుకోసం బయలుదేరి రాఘవపురం సమీపించేసరికి బాగా అలిసి పోయాడు. ఊరి పొలిమేరలో ఉన్న గ్రామదేవత గుడి ముందు కాస్సేపు సేదదీరడానికి కూర్చు న్నాడు. కొంతసేపటికి గుడిపూజారితో మాటలు కలిశాయి. గోవిందుడు పని వెతుక్కుంటూ ఆ ఊరు వచ్చాడని గ్రహించిన పూజారి, ''సమయానికి వచ్చావు. బావిలో నీళ్ళు తోడి, గుడిని శుభ్రం చేయడానికి మనిషికోసం చూస్తున్నాను. నువ్వు ఆ పనులు చేశావంటే నెలకు రెండు వరహాలు జీతం,'' అన్నాడు.

ఊళ్ళో అడుగు పెట్టీ పెట్టగానే పని దొరి కింది. ఎందుకు కాదనడం? ఇంతకన్నా మంచి పని దొరికేవరకు ఇక్కడే ఉందాం, అని ఆలో చించిన గోవిందుడు అందుకు సరేనన్నాడు.

రోజూ ఉదయం బావిలో నీళ్ళుతోడి గుడి వాకిలి కడిగేవాడు. గుడి ఆవరణలో చెట్లకు నీళ్ళు పోసేవాడు. సాయంత్రం ఆవరణ అంతా నీళ్ళు చల్లి చల్లబరచేవాడు. జీతంతో పాటు రెండు పూటలా ప్రసాదం దొరికేది. రాత్రి సమయంలో గుడి అరుగు మీదే పడుకునేవాడు.

అంతా బాగానే ఉందికాని, గుడికి వచ్చే కొత్త దంపతులను చూసినప్పుడు, అతడు తనూ పెళ్ళి చేసుకోవాలనీ, ఒక ఇల్లు కట్టు కుని సంతోషంగా జీవించాలనీ కలలు గన సాగాడు.

ఇలా ఉండగా దేవీ నవరాత్రుల సంద ర్భంగా గుడిలో పురాణ కాలక్షేపానికి ఒకపండి తుడు వచ్చాడు. ఆయన ఒకనాడు కథ చెబుతూ కల్పవృక్షం గురించి ప్రస్తావించాడు. కల్పవృక్షం కోరిన కోర్కెలను తీరుస్తుందని చెప్పాడు.

డా. గంగిశెట్టి శివకుమార్



పఠనం పూర్తిచేసి పండితుడు విశ్రాంతి తీసుకుంటూన్న సమయంలో గోవిందుడు ఆయన దగ్గరికి వెళ్ళి నమస్కరించి, ''ఆ కల్పవృక్షం ఎక్కడ ఉంటుందో చెప్పగలరా స్వామీ,'' అని అడిగాడు.

''అది దేవలోకంలో ఉంటుంది,'' అన్నాడు పండితుడు.

''అరరే. అది భూలోకంలో ఉండదా?'' అని అడిగాడు గోవిందుడు ఆశాభంగానికి లోనైన వాడిలా.

''ఎందుకు ఉండదూ? ఉంటుంది! అయితే దాన్ని కలియుగ కల్పవృక్షం అంటారు,'' అన్నాడు పండితుడు.

''అది ఎక్కడ ఉంటుందో మీకు తెలుసా స్వామీ? చెప్పండి,'' అని అడిగాడు గోవిందుడు ఆత్రుతగా.

''అది నాకూ స్పష్టంగా తెలియదు నాయనా! అయినా, పడమటి కొండల దిగువ ఉన్న ఇంద్రాద్రి సమీపంలో ఉన్నట్టు పెద్దలు చెప్పగా విన్నాను. అది అనునిత్యం పుష్ప ఫల భరితమై ఉంటుందట!'' అన్నాడు పండితుడు.

తను ఎంతకాలం గుళ్ళో నీళ్ళుతోడినా రెక్కలు ముక్కలు కావడం తప్ప తన కోరికలు తీరవు. అందుకని తెగించాలి. తప్పదు. కలియుగ కల్పవృక్షం జాడ వెతకాలి. తన కోరికలు తీర్చుకోవాలి-అని నిర్ణయించుకుని మరునాడు వేకువ జామున లేచి ఎవరికీ చెప్పా పెట్టా కుండా పడమటి కొండల కేసి బయలుదేరాడు.

ఐదు రోజుల ప్రయాణం తరవాత వాడు పడమటి కొండల దిగువ భాగానికి చేరాడు. అక్కడ ఒక చిన్న గుడిసె, దాని చుట్టూ సాగు చేయబడుతూన్న మామిడి చెట్లూ ఉన్నాయి. చెట్లకు పాదులు తీస్తూ ఒక రైతూ, ఆ పాదుల్లో నీళ్ళు పోస్తూ ఇద్దరు ఆడవాళ్ళూ కనిపించారు. వాళ్ళు చూడడానికి తల్లీ కూతుళ్ళలా ఉన్నారు.

గోవిందుడు రైతు దగ్గరికి వెళ్ళి, ''అయ్యా, నేను చాలా దూరం నుంచి వస్తున్నాను. పడమటి కొండల్లో కలియుగ కల్పవృక్షం ఉందని పురాణం పండితుడు చెప్పగా విని, దాన్ని వెతుక్కుంటూ వచ్చాను. దాని జాడ నువ్వేమైనా చెప్పగలవా? చూస్తూంటే చాలా కాలంగా మీరు ఇక్కడే ఉన్నట్టున్నారు,'' అన్నాడు.

రైతు తలపైకెత్తి చూసి నిట్టూర్చి, ''నేనూ ఒకప్పుడు కలియుగ కల్పవృక్షాన్ని వెతు

క్కుంటూ ఇక్కడికి వచ్చినవాణ్ణే. ఎంత వెతికినా దాని జాడ కనిపించలేదు. ఇప్పుడు నువ్వు వచ్చావు గనక, ఇక ఇద్దరం కలిసి వెదుకుదాం. కనబడిందంటే ఇద్దరి కోరికలూ తీరుతాయి. అంతవరకు మామిడి తోట సాగులో నువ్వు సాయపడాలి. అదిగో కనబడే ఆ వాగు నుంచి ఏతం వేసి చెట్లకు నీరు పారించడానికి సాయపడాలి. నీ శ్రమకు తగ్గ ఫలితం ఉంటుంది, సరేనా?'' అన్నాడు.

''ఇక్కడా నీళ్ళుతోడే పనేనా? అయినా కల్పవృక్షం వెతకడంలో తోడువస్తానంటున్నాడు కదా,'' అనుకుని గోవిందుడు అందుకు సరే అన్నాడు.

ఆ రోజు నుంచి రైతుతో కలిసి వాగు నుంచి బొక్కెనతో ఏతం వేసి మామిడి చెట్లకు నీరు పారించడం, తీరిక సమయంలో అడవిలోకి వెళ్ళి కలియుగ కల్పవృక్షాన్ని వెతకడం చేసేవాడు. ఇలా రెండు మూడేళ్ళు గడిచి పోయాయి గాని, కల్పవృక్షం జాడకనిపించలేదు. గోవిందుడు రైతుకుటుంబంలో ఒకడుగా కలిసి పోయాడు.

ఆయేడు మామిడి చెట్లు పూతపూసి తొలి కాపు విరగకాశాయి. పళ్ళు తింటే చెప్ప లేనంత తియ్యదనం!

ఒకనాడు పళ్ళ వ్యాపారి ఒకడు సేవకుడితో కలిసి రాజధానికి వెళుతూ, మామిడి తోట వద్ద కాస్సేపు విశ్రాంతికని ఆగాడు. రైతు అతడికి తినడానికి రెండు మామిడి పళ్ళిచ్చాడు. ఆ పళ్ళ రుచి చూసిన వ్యాపారి, ''ఈ కాపంతా నాకిచ్చేయ్. నువ్వడిగినంత డబ్బు ఇస్తాను.



వీటిని రాజుగారి అంతఃపురానికి పంపిణీ చేసి నేనూ కొంత లాభం గడిస్తాను,'' అన్నాడు.

రైతు తన కష్టానికి తగ్గ ఫలితం లభించిందని సంతోషించి అలాగే నన్నాడు. వర్తకుడు రైతు అడిగిన ధనం ఇచ్చి, రెండు మూడు రోజుల్లో బండ్లతో వచ్చి పళ్ళను దించుకు పోగలనని చెప్పి వెళ్ళాడు.

తన కష్టానికి రెండింతలు ఫలితం లభించే సరికి రైతుకు చాలా ఆనందం కలిగింది. ఆయన పక్కనే నిలబడ్డ గోవిందుడితో, ''ఈ ఫలితంలో నీకూ భాగం ఉన్నది,'' అంటూ కొంత డబ్బును గోవిందుడి చేతిలో పెట్టాడు.

గోవిందుడు సంతోషపడకుండా, ''ఈ డబ్బుతో నా కోరికలు తీరవు. కల్పవృక్షం జాడను ఇంతవరకు నువ్వు చూపలేకపోయావు,'' అన్నాడు నిష్ఠూరంగా.

''కల్పవృక్షం జాడ నీకిప్పుడే కనబడింది. అయితే, నువ్వే దాన్ని గమనించలేదు,'' అన్నాడు రైతు.

''కల్పవృక్షమా! ఎక్కడ?'' అని అడిగాడు గోవిందుడు ఆత్రుతగా.

''కల్పవృక్షం అంటే కోరిన కోరికలు తీర్చేదే కదా! నువ్వు చెట్లకు నీళ్ళు పారించావు. అవి నీకు డబ్బిచ్చాయి. ఈ డబ్బుతోనే నీ కోరిక లన్నీ తీరకపోవచ్చు. అయితే, ఇలాగే కష్టపడ్డా వంటే క్రమంగా నీ కోరికలన్నీ నెరవేరుతాయి. అప్పుడు ఇవి కల్పవృక్షాలే కదా. వాటిని మనం ప్రేమగా పెంచుకుంటే, అవి మన కోరికలన్నిటినీ తీరుస్తాయి,'' అన్నాడు రైతు.

''అయితే, నువ్వు కల్పవృక్షం కోసమే ఇక్క డికి వచ్చాననడం, నాకు దాని జాడ చూపిస్తా నడం అంతా అబద్ధమన్న మాట!'' అన్నాడు గోవిందుడు.

''అవును. అయినా నిన్ను మోసం చెయ్యా లన్నది నా ఉద్దేశం కాదు. నేనూ నీలాగే వయ సులో కష్టపడకుండా పైకిరావాలని గాలి మేడలు కట్టి, తెలియని వ్యాపారాలెన్నో చేసి, తండ్రి ఇచ్చిన ఆస్తిపాస్తులను కరగదీశాను. అంతా అయిపోయాక గాని నిజం తెలిసిరా లేదు. ఆ తరవాత కాయకష్టాన్ని నమ్ముకు న్నాను. నువ్వూ నాలాంటి వాడివేనని తెలిశాక, నిన్ను దారిలో పెట్టాలనీ, శ్రమ విలువ నీకు తెలియజేయాలనీ అబద్ధం చెప్పాను,'' అన్నాడు రైతు.

గోవిందుడు నివ్వెరపోయి మరేమీ మాట్లాడ లేకపోయాడు. ఇంతలో గుడిసెలో నుంచి వెలుపలికి వచ్చిన రైతు భార్య, ''ఇంకా ఎందుకు విషయం దాస్తావు. మనసులో ఉన్నది చెప్పరాదూ,'' అన్నది భర్తతో.

రైతు తల పంకించి, ''గోవిందా, నువ్వు ఇక ఎక్కడికీ వెళ్ళనవసరం లేదు. మాతోనే ఉండు. నీకు సమ్మతమైతే మా కూతురునిచ్చి పెళ్ళి చేస్తాం. ఇక మీదట నువ్వు పనివాడివి కావు; యజమానివి,'' అన్నాడు.

గోవిందుడు కొంతసేపు ఆలోచించి సరే అన్నాడు. ఆ విధంగా అతడి తొలికోరిక నెర వేరింది. ఇంటిల్లిపాదీ కష్టం ఫలించడంతో మరి కొంత కాలానికి గోవిందుడు తోట మధ్య చిన్న ఇల్లు కట్టుకున్నాడు. రెండో కోరికా నెరవేరింది. పిల్లాపాపలతో హాయిగా బతకసాగాడు.



# రాజ్యాంగశిల్పికి స్ఫూర్తినిచ్చిన క్రికెట్ క్రీడాకారులు!



స్వాతంత్ర్యోద్యమంలోనూ, అస్పృశ్యులుగా భావించబడ్డ దళితజనోద్ధరణకూ డా. బి.ఆర్. అంబేద్కర్ నిర్వహించిన పాత్ర, అందించిన సేవలు అమూల్యమైనవి. కాన్స్టువంట్ అసెంబ్లీ రూపొందించిన రాజ్యాంగం అమలులోకి రావడంతో 1950 జనవరి 26వ తేదీ మనదేశం గణతంత్ర రాజ్యం (రిపబ్లిక్) అయింది. రాజ్యాంగ రచనలో ప్రధాన పాత్ర వహించిన రాజ్యాంగ శిల్పి అంబేద్కర్. ఆయన సాంఘిక దురన్యాయానికి గురైన దళిత వర్గంలో పుట్టినప్పటికీ ఆ అవరోధాలన్నిటినీ అధిగమించి ఉన్నత స్థాయికి ఎదిగిన మేధావి.

ఎవరైనా సరే ఉన్నతస్థాయికి చేరడానికి స్ఫూర్తి కీలకపాత్ర వహిస్తుంది. ఆ విధంగా అంబేద్కర్‌కు స్ఫూర్తినిచ్చినవారు పలువురున్నారు. వారిలో ముఖ్యమైనవాడు ధార్వాడ్ చమార్ (చర్మకారుల) వర్గానికి చెందిన క్రికెట్ క్రీడాకారుడు పాల్వంక బలూ. అతడు దళిత కులంలో పుట్టినప్పటికీ 20వ శతాబ్ది తొలిదశలో మన దేశానికి చెందిన ఉత్తమ బౌలర్‌గా కీర్తిగాంచాడు. అతడు తన ప్రతిభకు మెరుగులు దిద్దుకోవడానికి డెక్కన్ జిమ్ఖానా క్లబ్‌ను ఆశ్రయించాడు. క్రమంగా అతడి సోదరులు శివరాం, గణ్‌పత్, విఠల్ సేర్పరులైన క్రికెట్ ఆటగాళ్ళుగా పేరుగాంచారు. 1923లో సుప్రసిద్ధమైన విజయాన్ని సాధించిన టీమ్ లీడర్‌గా విఠల్‌ను ఉన్నత వర్గాలకు చెందిన సహక్రీడాకారులు భుజాల మీదికెత్తుకున్నారు!

దళితులైన ఆ అన్నదమ్ములు అంబేద్కర్ మనసులో స్ఫూర్తి కళికను రగిలించారు. వారిని తలుచుకున్నప్పుడల్లా అంబేద్కర్ హృదయం ఎంతో గర్వంతో నిండి పోయేది. అంబేద్కర్ బొంబాయిలో ఉపన్యాసకుడయ్యాక, తన కలల సాఫల్యానికి అవరోధాలన్నిటినీ అధిగమించి విజయాన్ని సాధించిన ఆ క్రీడాకారుడికి అభినందన సభలు ఏర్పాటు చేశాడు!

జనవరిలో గణతంత్ర దినోత్సవాలు జరుపుకుంటూన్న ఈ శుభతరుణంలో ఆ వీరులను స్మరించుకోవడం మన కర్తవ్యం. ఈనాటికీ మన సమాజంలో రకరకాల అసమానతలు, దురన్యాయాలూ, అక్కడక్కడా కొనసాగుతూనే ఉన్నాయన్న విషయం మరిచి పోకూడదు. బంతిని చేపట్టిన ఒక వీరుడు జాతి భవితవ్యాన్నే మార్చగలిగాడు. మరి మార్పు అంతటితో ఆగి పోకుండా పురోగమించడానికి మనమందరం దీటుగా ముందడుగు వేద్దాం!




# పాతాళదుర్గం

## 6

*[కుంభీరుడూ, కాలశంబరుడూ చెరొక గుహలోకి పారిపోయారు. సోమకుడు చెట్టు గుబురు కొమ్మపై నుంచి కంఠానికి గురిపెట్టి విడిచిన బాణం కదంబరాజు ఉగ్రసేనుణ్ణి భుజం మీద గాయపరిచింది. ఉగ్రసేనుడు రాజద్రోహులని ప్రకటించిన ధూమక సోమకులకు, కుంతలదేశ మంత్రి గంగాధరుడు అభయం ఇచ్చాడు. వాళ్ళిద్దరూ చెట్టుకొమ్మల్లో నుంచి ఆనందంతో కిందికి దూకారు. -తరవాత]*

ధూమక సోమకులను చూస్తూనే, కదంబ రాజు ఉగ్రసేనుడు కంపించిపోతూ, ''మహా మంత్రీ! వీళ్ళకు మీరు అభయప్రదానం చేయటం ఏమీ బాగాలేదు. వీళ్ళు అరాజక వాదులు. ఒక రాజుకు ద్రోహం తలపెట్టిన వాళ్ళు మరో రాజుకు ద్రోహం చెయ్యరన్న నమ్మకం ఏమిటి?'' అన్నాడు.

ఇంతలో ధూమకసోమకులిద్దరూ మంత్రి గంగాధరుడి ముందుకు పరిగెత్తుకుంటూ వెళ్ళి, ఆయన ముందు సాష్టాంగ పడి పోయారు. గంగాధరుడు వాళ్ళను లేవవల సిందిగా ఆజ్ఞాపించి, ''ఇప్పుడు మీరిద్దరూ నిజమైన యోధుల్లా కనిపిస్తున్నారు. మీరు పితృ భ్రాతృ హంతకులన్న మాట నేనేమాత్రం నమ్మలేదు. మీకు యోధులకు తగిన దుస్తులు ఇప్పిస్తాను. మహారాజును గాయ పరిచిన వాళ్ళు మీ ఇద్దర్లో ఎవరు?'' అని అడిగాడు.

'చందమామ'



''మహామంత్రీ! కొంచెం ఆలోచించండి. విశ్వాస ఘాతకులైన రాజద్రోహుల్ని క్షమించటమా? అదెలాంటి రాజనీతి? వీళ్ళు పన్నులు చెల్లించ వద్దని రైతులను రెచ్చగొట్టిన తిరుగుబాటుదార్లు,'' అన్నాడు ఉగ్రసేనుడు కోపంగా.

''ప్రభూ! ఈ ఉగ్రసేనుడికీ, ఇతడి మంత్రికీ పరిపాలన అంటేపన్నులు వసూలు చేయటం అన్న అర్థం తప్ప మరొకటి తెలియదు. పారిపోయారు గాని లేకపోతే, ఆ కుంభీరుడి దగ్గిరా, కాలశంబరుడి దగ్గిరా కూడా పన్నులు వసూలు చేసేవాడే ఈ రాజు!'' అన్నాడు ధూమకుడు పళ్ళు కొరుకుతూ.

కుంభీరుడూ, కాలశంబరుడూ అన్న పేర్లు వింటూనే మంత్రి గంగాధరుడు ఆశ్చర్యపడి, ''వాళ్ళిద్దరూ ఎవరు? మహారాజు గారి పుత్రికను అపహరించుకు పోయిన రాక్షసులా?'' అని ప్రశ్నించాడు.

ధూమకసోమకులు రాత్రి గుహల ముందు జరిగినదంతా మంత్రి గంగాధరుడికి చెప్పారు. కుంభీరుడంతటి మహారాక్షసుణ్ణి ఎదిరించి, తన మంత్రదండంతో అతడి కొమ్ము విరగగొట్టిన కాలశంబరుడు చాలా గొప్ప మంత్రవేత్త అయి వుంటాడని గంగాధరుడు భావించాడు. అంతేకాక, ఆ మాంత్రికుడు రాక్షసుడితో అన్న మాటలు, 'నేనిక్కడ ఒక మహావీరుడికి మూలికా వైద్యం చేసి గాయాలు మాన్పి...' - ఆ గాయపడినవాడు తన పుత్రుడు శశికాంతుడెందుకై ఉండకూడదు? ఈ అనుమానం రాగానే గంగాధరుడు, ధూమక

''ప్రభూ! ఈ దుష్టరాజు కంఠానికి గురి చేసి బాణం వదలమన్నాను కాని, సోమకుడు జాలి తలిచి భుజానికి తగిలేలా బాణం కొట్టాడు, రాజు బతికిపోయాడు,'' అన్నాడు ధూమకుడు.

సోమకుడు కళ్ళెర్రచేసి ఉగ్రసేనుడి కేసి తిరిగి ఏమో అనబోయేంతలో మంత్రి గంగాధరుడు చేయెత్తి అతణ్ణి వారించి, ఉగ్రసేనుడితో, ''మహారాజా! వీళ్ళు మీ ప్రాణానికి పగబట్టిన తాచుపాముల్లాంటి వాళ్ళు. మీరు వాళ్ళపై అత్యాచారం చేశారు. వాళ్ళు మిమ్మల్ని గాయపరిచి పగ తీర్చుకున్నారు. సరికి సరి. పగను కొనసాగించడం ఉభయులకూ క్షేమం కాదు. ఇప్పుడు వాళ్ళను క్షమించానని ఒక్క మాట అనండి. ఈ పగ ఇంతటితో తీరిపోతుంది,'' అన్నాడు.



సోమకులను, అతడు కనిపించిన గుహను చూపెట్టమన్నాడు.

ధూమకసోమకులు గుహల కేసి బయలు దేరారు. మంత్రి గంగాధరుడు కొద్దిమంది సైనికులతో వాళ్ళను అనుసరించాడు. ఉగ్ర సేనుడు కూడా మూలుగుతూ వాళ్ళ వెనగ్గా నడిచాడు. ధూమకసోమకులిద్దరూ గుహల ముందు నిలబడి, ''ప్రభూ! మాంత్రికుడు ఈ గుహలో నుంచి బయటికివచ్చి, చేతికి బాణం తగలగానే లోపలికి పరిగెత్తాడు. ఇది కుంభీరుడు రాకుమారితో ప్రవేశించిన గుహ!'' అని చూపెట్టారు.

''ఆ రాక్షసుణ్ణి చుట్టుముట్టి పట్టుకోవాలి, మహామంత్రీ! ఇక్కడ ఆజ్ఞలివ్వవలసింది తమరని సెలవిచ్చారు గనక, సైనికుల్ని హెచ్చ రించండి,'' అన్నాడు ఉగ్రసేనుడు.

''మహారాజా! ఆ రాక్షసుడూ, మాంత్రి కుడూ ఇంకా గుహల్లోనే దాగి వుండేటంత బుద్ధిహీనులలని నేననుకోను. అయినా మన జాగ్రత్తలో మనం వుండటం మంచిదే,'' అంటూ మంత్రి గంగాధరుడు సైనికులను హెచ్చరించాడు.

సైనికులు కొందరు ఈటెలు బారుచేసి రాక్షసుడు పోయిన గుహలోకి బెదురు బెదురుగా ప్రవేశించారు. గుహ అంధకార మయంగా ఉన్నది. దివిటీలు వెలిగించి కత్తులూ, ఈటెలూ సిద్ధంగా పట్టుకుని గుహలో కొంత ముందుకు వెళ్ళేసరికి, హఠాత్తుగా ముందున్న వాళ్ళ మీదికి ఒక నల్లని ఆకారం పైనుంచి దూకింది. ఆ వెంటనే గగ్గోలు ప్రారంభమై గుహ నుంచి బయట పడేందుకు సైనికులు తొక్కిసలాడి, ''రాక్ష సుడు! రాక్షసుడు!'' అంటూ కేకలు పెడుతూ బయటికి పారిపోయి వచ్చారు.

మంత్రి గంగాధరుడు వాళ్ళను ఆపి, ''రాక్షసుణ్ణి మీరు చూశారా? వాడేమైనా మీదికి వచ్చాడా? లేక వాడి అరుపు విన బడిందా?'' అని ప్రశ్నించాడు.

''గుహంతా కన్నుపొడుచుకున్నా కానరా నంత చీకటి, ప్రభూ. కీబాగీబా అంటూ ఏవో మోతలు వినబడినై. అయినా, తెగించి ఇంకా ముందుకు వెళ్ళాం. మాటాపలుకూ ఏ హెచ్చరికా లేకుండా వాడు ముందు నడు స్తున్న ఇద్దరు దివిటీల వాళ్ళ మీద నిలువునా దూకేసి గావుపట్టు పట్టాడు,'' అన్నాడు సైనికుల్లో ఒకడు.



మంత్రి గంగాధరుడికి ఇవి నమ్మదగిన మాటల్లా కనిపించలేదు. ఏది ఏమైనా ఇద్దరు సైనికులు గుహలో ప్రమాదస్థితిలో వున్నారు. అతడు తన సైనికుల నాయకుణ్ణి పిలవబోయేంతలో, ధూమకసోమకులిద్దరూ గుహ పక్కగా పడివున్న దివిటీలు రెండు తీసుకుని, కత్తులు దూసి, ''ఒరే, కుంభీరరాక్షసా! వస్తున్నాం, కాచుకో!'' అంటూ ఒక్క గెంతున గుహలోకి పరిగెత్తారు.

వాళ్ళ సాహసం చూసి మంత్రి గంగాధరుడు అచ్చెరువందాడు. రాజు ఉగ్రసేనుడు చేయెత్తి, ''నా కుమార్తెను క్షేమంగా బయిటికి తెచ్చారంటే, మీ రాజద్రోహాన్ని క్షమిస్తాను,'' అంటూ కేక పెట్టాడు.

మంత్రి గంగాధరుడు గుహలోకి ప్రవేశించాడు. మరికొందరు సైనికులు కూడా దివిటీలతో లోపల ప్రవేశించారు. ఈ లోపల ధూమకసోమకులు గుహలో కొంతదూరం వెళ్ళేసరికి, వాళ్ళకు, ''అయ్యో, రక్షించండి! బాబో, కాపాడండి!'' అంటూ సైనికులు చేస్తున్న ఆర్తనాదాలు వినిపించినై.

ధూమకసోమకులు ఒక్కక్షణం ధైర్యం చెదిరి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. రాక్షసుడు సైనికులిద్దర్నీ విరుచుకు తింటున్నాడన్న భయం వాళ్ళకు కలిగింది. కాని, అంతలోనే సోమకుడు భీకరంగా అరిచి, ''ధూమూ! మనకు భయమేంటి? మన గ్రామదేవత కాళేరమ్మను తలుచుకో! జై, కాళేరమ్మా!'' అంటూ ముందు కురికాడు. ధూమకుడు కూడా అతడితోపాటు జైకొడుతూ మరికొంచెం దూరం ముందుకు వెళ్ళేసరికి, అక్కడ ఎదురైన దృశ్యం, ఇద్దర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసింది.

ఒక పెద్ద కొండచిలువ ఒక సైనికుణ్ణి తల వైపు నుంచి కొంచెం కొంచెమే మింగుతూ, రెండవవాణ్ణి తోకతో చుట్టబెట్టి గుహ గోడలకేసి విసిరివిసిరి కొడుతున్నది. ఇద్దరు సైనికులూ హాహాకారాలు చేస్తున్నారు. సోమకుడు కత్తితో కొండచిలువ మెడ మీద నాలుగైదుసార్లు బలంగా కొట్టేసరికి, దాని మెడ సగం తెగిపోయింది. సైనికుడు దాని నోటి నుంచి బయటికి వచ్చి, సొమ్మసిల్లి నేల మీద పడిపోయాడు. ఈ లోపల ధూమకుడు కొండచిలువ నడుం మీద కత్తితో కొట్టి, దాన్ని రెండుగా నరికాడు. రెండవ సైనికుడు దాని పట్టునుంచి బయటపడి పిచ్చివాడిలా కేకలు



పెడుతూ గుహలో అటూ ఇటూ గంతులు వెయ్యసాగాడు.

మంత్రి గంగాధరుడు కొందరు సైనికులతో అక్కడికి వచ్చి, రక్తపు మడుగులో విలవిలా కొట్టుకుంటున్న కొండచిలువనూ, నెత్తురోడుతున్న కత్తులతో నిలబడి వున్న ధూమక సోమకులనూ చూసి, ''రాక్షసుడెక్కడ?'' అని ప్రశ్నించాడు.

''ఇక్కడ రాక్షసుడెవడూ లేడు, ప్రభూ! మీ సైనికులు చీకట్లో హఠాత్తుగా మీది కురికిన కొండచిలువను చూసి, రాక్షసుడనుకున్నారు,'' అన్నాడు ధూమకుడు.

''రాక్షసులు మాయావులు. వాళ్ళు కావాలనుకున్న రూపం క్షణాల మీద వచ్చేస్తుంది. ఆ కుంభీరుడే ఈ కొండచిలువ రూపం ధరించి వుంటాడు. నా కుమార్తె ఎక్కడ?'' అంటూ రాజు ఉగ్రసేనుడు కీచుమన్నాడు.

మంత్రి గంగాధరుడు ఉగ్రసేనుడి భుజం మీద చేయివేసి సముదాయిస్తూ, ''మహారాజా! మీరు ఈ చీకటి గుహలోకి ఎందుకొచ్చారు? బయట చల్లగాలిలో కొంచెం విశ్రాంతి తీసుకోండి. మీ కుమార్తెను అపహరించుకుపోయిన రాక్షసుడు ఈ గుహలో ఎక్కడున్నా, వెతికి పట్టుకునే బాధ్యత నాది,'' అన్నాడు.

ఇంతలో ధూమకసోమకులు దివిటీలు తీసుకుని గుహలో కొంతదూరం వెళ్ళి, అది మూడు నాలుగు సొరంగ మార్గాలుగా చీలిపోవటం చూశారు. ఆ మార్గాలన్నీ కొండ దిగువకూ, అరణ్యంలోకీ; ఎటు కావాలంటే అటు వెళ్ళేందుకు వీలుగా వున్నవి. రాక్షసుడు ఈ మార్గాల్లో ఏదో ఒకటి ఎన్నుకుని పారిపోయి వుంటాడని వాళ్ళు గ్రహించారు. తరవాత వాళ్ళు తిరిగి వచ్చి, గంగాధరుడికి ఆ విషయం చెప్పారు.

గంగాధరుడు నిరుత్సాహంగా తలవూపి, ''సరే, ప్రస్తుతానికి చేయగలిగిందేమీలేదు. ఆ మాంత్రికుడు కనిపించిన గుహ ఎలా వున్నదో చూద్దాం పదండి,'' అన్నాడు.

అందరూ గుహనుంచి బయిటికి వచ్చారు. కొండచిలువ సగం మింగి వదిలిన సైనికుణ్ణి కొందరు భుజాని కెత్తుకున్నారు. మతిపోయి అరుస్తున్న రెండవ సైనికుణ్ణి కొందరు సైనికులు నడుముకు తాడు కట్టి బయటికి లాక్కొచ్చారు.

మాంత్రికుడు కాలశంబరుడు కనిపించిన గుహ ఏమంత చీకటిగా లేదు. ఎక్కణ్ణుంచో కొంతవెలుగు గుహలో ప్రవేశిస్తున్నది. ధూమక సోమకులు ముందు గుహలో ప్రవేశించారు. వారికి కొంచెం వెనగ్గా మంత్రి గంగాధరుడు వెళ్ళాడు. లోపలవున్న గుడ్డివెలుగులో వారికి క్రూరమృగాలేవో తిని వదిలిన ఒక మానవ కళేబరం కనిపించింది. దాన్ని చూస్తూనే గంగాధరుడు ఒక్క దూకున ముందుకు వెళ్ళి, కళేబరాన్ని పరీక్షించి చూసి, ''ఇది, జయంతుడి శవం! ఈ ప్రాంతాల మరే దైనా...'' అంటూ చుట్టూ కలయ చూడ సాగాడు.

ఆ సమయంలో అతడి కళ్ళల్లో నీళ్ళు తిరగటం ధూమకసోమకులకు కనిపించింది. వాళ్ళిద్దరూ గుహలో కొంతదూరం వెళ్ళేసరికి ధూమకుడికి మెరుస్తూ ఒక వస్తువు కన బడింది. వాడు దాన్ని పైకెత్తి చూశాడు. అది కాలశంబరుడి మంత్రదండం! ఆ క్షణంలో ధూమకుడికి కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు. వాడు మంత్రదండాన్ని చేతిలో గిరగిరా తిప్పుతూ, మంత్రి గంగాధరుడి దగ్గిరకు వచ్చి, ''ప్రభూ! మాంత్రికుడు కూడా గుహ లోంచి పారిపోయాడు. ఇది, ఆ కాలశంబ రుడి మంత్రదండం, నాకు దొరికింది!'' అంటూ మంత్రదండాన్ని గంగాధరుడికి చూపించాడు.

''నీకు దొరికింది గనక అది నీదే! దీనిలో అద్భుతశక్తులుండవచ్చు,'' అంటూ మంత్రి గంగాధరుడు గుహనుంచి బయటికి వచ్చి, విచారంగా ఒక రాతిమీద కూర్చుని వున్న రాజు ఉగ్రసేనుణ్ణి సమీపించి, ''మహారాజా! విచా రించకండి. మనిద్దరం దురదృష్టవంతులమే. మీరు ఒక్కగానొక్క కుమార్తెను కోల్పోయారు, నేనూ నా ఒక్కగానొక్క కుమారుణ్ణి పోగొట్టు కున్నాను. ఆ రాక్షసుడూ, మాంత్రికుడూ ఎక్కడున్నారో తెలిస్తే తప్ప...'' అంటూన్నం తలో కదంబదేశ మంత్రి ఒళ్ళంతా గాయా లతో, చిరిగిపోయిన దుస్తులతో గుర్రం మీద వేగంగా అక్కడికి వచ్చి, ''మహారాజా! నాశనం! సర్వనాశనం!'' అంటూ గుర్రం మీంచి చప్పున దిగబోయి, కాలు రికాబులో చిక్కుకోవటంతో దభీమంటూ వెల్లకిలా కింద పడిపోయాడు. -(ఇంకావుంది)





# శశికళ నిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకుతిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు దృఢచిత్తుడి వన డంలో నాకు ఇసుమంత అను మానం లేదు గాని, ఎలాంటి నిర్ణ యంతో ఇలా శ్రమపడుతున్నావో మాత్రం అంతుబట్టడం లేదు. ఎందు కంటే—ఎవరు ఎప్పుడు ఎలాంటి నిర్ణ యాలు తీసుకుంటారో చెప్పడం కష్టం. మరీ ఉద్వేగ పూరిత మనస్కులై ఉన్న ప్పుడు తీసుకునే నిర్ణయాలు ఒక్కొక్క సారి అసంబద్ధంగానూ ఉంటాయి. విగత జీవుడైన కాబోయే భర్తను పునర్జీవితుణ్ణిచేయించుకోవడంలో ఉద్వేగానికిలోనై ఘోర తప్పిదం చేసిన శశికళ అనే వధువు కథ

బేతాళ కథలు



చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

మాణిక్యపురి రాజ్యంలోని జగన్నాధపురం అనే గ్రామానికి చెందిన జక్కన్న అనే కుర్రవాడికి చదువుపట్ల ధ్యాస, కొత్త విషయాలు తెలుసుకోవాలనే జిజ్ఞాస మెండుగా ఉండేవి. అయితే, వాడి తండ్రి రంగదాసు కొడుకును చదివించలేక పోయాడు. ఎందుకంటే అతడు చేసేది కొండరాళ్ళను భవన నిర్మాణాలకు అనుగుణంగా మలిచే పని. జక్కన్న తల్లి అనారోగ్యంతో లేవలేని స్థితి ఏర్పడింది. జక్కన్న తల్లికి సేవచేస్తూ వంట చేసి, మధ్యాహ్నం తండ్రి పనిచేసే చోటికి తిండి తీసుకువెళ్ళాలి. ఆ తరవాత తండ్రికి పనిలో సాయపడాలి.

చదువు మీది ధ్యాస చంపుకోలేక, ఎలాగైనా చదివి తీరాలన్న పట్టుదలతో జక్కన్న ఒకనాడు ఎవరితోనూ చెప్పాపెట్టాకుండా ఇల్లు వదిలిపెట్టాడు. వారం రోజుల పాటు ఎక్కడెక్కడో తిరిగాడు. ఎనిమిదో రోజు మధ్యాహ్నం వాడు ఒక వాగు గట్టు మీది చెట్టు కింద కూర్చుని ఏదో ఆలోచిస్తూండగా, ''కాపాడండి, కాపాడండి,'' అన్న కేకలు వినిపించాయి. జక్కన్న అటు వైపు తిరిగి చూశాడు. కుర్రవాడొకడు ప్రాణాలకు కొట్టు మిట్టాడుతూ వాగులో కొట్టుకుపోతున్నాడు. జక్కన్న ఒక్క గెంతున వెళ్ళి చేయి అందించి, అతి ప్రయత్నం మీద వాణ్ణి గట్టు పైకి లాగాడు. వాగులో నీళ్ళు తాగడానికి వంగి కాలుజారి పడిపోయిన ఈతరాని ఆ కుర్రవాడి పేరు నవనీతుడు. వాడూ ఇంటి నుంచి పారిపోయి వచ్చినవాడే. అయితే, పారిపోయివచ్చింది చదువుకోమని తల్లిదండ్రులు బలవంతం చేసినందుకు!

పరస్పర పరిచయాల తరవాత ఇద్దరూ కలిసి చేతివృత్తుల వారి వద్ద పనులు చేస్తూ కడుపు నింపుకోసాగారు. ఇద్దరూ క్రమంగా విడదీయరాని మిత్రులయ్యారు.

ఇన్ని కష్టాలలోనూ జక్కన్న పలు గురువులను ఆశ్రయించి అచంచలమైన దీక్షతో, మిత్రుడు నవనీతుడు రకరకాల పనులు చేస్తూ అందించిన ఆర్థికసాయంతో అనేక విద్యలు నేర్చుకున్నాడు. కాని ఎన్ని విద్యలు నేర్చినా పరకాయ ప్రవేశ విద్యతో సాటిరాదని అతడిలో తీవ్రమైన అసంతృప్తి ఉండేది. అతడొకనాడు నవనీతుడితో, ''నాకు చిన్నప్పటి నుంచి పరకాయ ప్రవేశ విద్యను నేర్చుకోవాలని ఉన్నది. ఇరవైయేళ్ళవుతున్నా అది సాధ్యపడ లేదు. ఆ విద్య ఇప్పుడు ఆదిమూల సిద్ధుడికి

మాత్రమే తెలుసునని విన్నాను. ఆయన వింధ్యాటవి మధ్య మకరందవనంలో తపస్సు చేసుకుంటున్నాడట. నువ్వు వస్తావా ఆయన వద్దకు వెళదాం,'' అన్నాడు.

నవనీతుడు అందుకు అంగీకరించడంతో ఇరువురూ కలిసి చాలా రోజులు ప్రయాణం చేసి మకరందవనంలో ప్రవేశించి ఆదిమూల సిద్ధుడి కుటీరం సమీపించారు. మిత్రులిద్దరూ ధ్యాన నిమగ్నుడై ఉన్న సిద్ధుడికి సాష్టాంగ నమస్కారం చేశారు. సిద్ధుడు కొంత సేపటికి కళ్ళు తెరిచి ఆశీర్వదించగానే జక్కన్న తన మనసులోని కోరికను విన్నవించాడు.

''అది నెరవేరదు. తిరిగి వెళ్ళవచ్చు,'' అన్నాడు సిద్ధుడు కటువుగా.

మామూలు మనుషుల చేతుల్లో అద్భుత శక్తులు దుర్వినియోగం అవుతాయన్నది సిద్ధుడి నమ్మకం. అందువల్ల తనకు తెలిసిన ఆ విద్యను మరెవరికీ బోధించకూడదనీ, అది తనతో అంతమై పోయినా ఫరవాలేదనీ అతడు అనుకున్నాడు.

''మహాత్మా, అద్భుత విద్యను అపాత్ర దానం చేయకూడదన్నది తమ మనోగతం కావచ్చు. అయినా ఇంత దూరం వచ్చాంగనక కొంత కాలం తమ సేవలో తరించే భాగ్యాన్న యినా ప్రసాదించండి,'' అన్నాడు జక్కన్న.

సిద్ధుడు అంగీకార సూచకంగా మౌనం వహించడంతో మిత్రులిద్దరూ ఆ క్షణం నుంచి భక్తిభావంతో కుటీరాన్ని శుభ్రం చేయడం, కందమూలాలు, ఫలాలు సేకరించుకు రావడం వంటి పనులు చేయసాగారు. ఆ విధంగా మూడు నెలలు గడిచిపోయాయి.



ఒకనాడు సూర్యోదయమవుతూండగా సిద్ధుడు మిత్రులిద్దరినీ చేర పిలిచి, '' నా జీవ యాత్ర పరిసమాప్తమయ్యే ఘడియ ఆసన్న మయింది. నాకు మాత్రమే తెలిసిన పరకాయ ప్రవేశ విద్య నాతోనే అంతమైపోవడం భావ్యం కాదు. అందువల్ల జక్కన్నకు ఆ మంత్రాన్ని ఉపదేశిస్తాను. అది దుర్వినియోగం కాకుండా చూసుకునే బాధ్యతను కూడా మీకు అప్పగిస్తు న్నాను. ఆ తరవాత అంతా భగవదేచ్ఛ,'' అంటూ నవనీతుడికేసి చూశాడు.

ఆ తరవాత ఆయన జక్కన్న చెవిలో మంత్రం ఉపదేశించి తుదిశ్వాస విడిచాడు.

మిత్రులిద్దరూ తిరుగు ప్రయాణమై కొన్నాళ్ళకు మార్గమధ్యంలోని హస్తగిరి అనే నగరానికి వచ్చారు. నగర ప్రజలు విచార వదనాలతో ఉండడం చూసి కారణం అడిగారు. నగర పాలకుడు రత్నభూషణుడి ఏకైక సంతానం



సుధాముడు. తను స్వారీ చేస్తున్న గుర్రం బెదిరి కొండ చరియ నుంచి పడదోయడంతో సుధాముడు హఠాన్మరణం పాలయ్యాడు. పుత్రశోకంతో తల్లిదండ్రులు స్పృహ కోల్పోయారు. సంగతి తెలియగానే, ''నువ్వు పరకాయ ప్రవేశ విద్యను ఉపయోగించి సుధాముడి శరీరంలో ప్రవేశించు,'' అన్నాడు నవనీతుడు జక్కన్నతో.

''అది ఈ సమస్యకు పరిష్కారమెలా అవుతుంది? ఎప్పటికైనా ఆ శరీరాన్ని వదలకతప్పదు కదా?'' అన్నాడు జక్కన్న అనుమానంగా.

''దుర్ఘటన హఠాత్తుగా జరిగినప్పుడే దుఃఖం భరించరానిదిగా ఉంటుంది. అది పునరావృతమైనప్పుడు దుఃఖభారం అంతగా ఉండదు. కాబట్టి ఇప్పుడు మంచివారైన సుధాముడి తల్లిదండ్రుల ప్రాణాలు కాపాడడమే మన కర్తవ్యం,'' అన్నాడు నవనీతుడు.

జక్కన్న మరేమీ మాట్లాడకుండా తను విగతజీవుడై పడి ఉన్నప్పుడు తన శరీరం చెడిపోకుండా ఉండడానికి వీలుగా సిద్ధుడు ఇచ్చిన నిత్యవసంత మూలికను నమిలిమింగాడు. ఆ తరవాత కాలభైరవాలయానికి వెనక ఉన్న గోతిలో పడుకుని పరకాయ ప్రవేశ మంత్రం జపించి తన శరీరాన్ని వదిలి సుధాముడి శరీరంలో ప్రవేశించాడు. నవనీతుడు జక్కన్న శరీరాన్ని పొదల మాటున దాచాడు.

సుధాముడి శరీరంలో కదలిక రావడంతో అందరూ సంతోషించారు. కొడుకు ప్రాణాలతోనే ఉన్నాడని తెలియగానే సుధాముడి తల్లిదండ్రులు లేచి కూర్చున్నారు.

అయితే, సుధాముడిగా మారిన తరవాత జక్కన్న జీవితంలో పెనుమార్పు వచ్చింది. అంతకు ముందెన్నడూ కడుపునిండా తిండికి కూడా నోచుకోని జక్కన్నకు పంచ భక్ష్య పరమాన్నాలతో షడ్రసోపేత భోజనం. ధరించడానికి ఖరీదైన దుస్తులు, ఆభరణాలు; పవళించడానికి పట్టు పరుపులు. సమకూరాయి. చెప్పిన పనులు చేయడానికి సేవకులు. అన్నిటికన్నా మించి అంతకు ముందే అనుకున్నట్టు ఆ ఊరి వర్తక ప్రముఖుడి కుమార్తె శశికళతో వివాహం కూడా నిశ్చయమయింది.

ఒక రోజు సాయంకాలం ఎప్పటిలా సంకేత ప్రదేశంలో కలుసుకున్న జక్కన్నకు, ''ఇక నువ్వు సుధాముడి శరీరం నుంచి బయటకు వచ్చెయ్,'' అని సూచించాడు నవనీతుడు.

'నేను నేర్చిన విద్యల లక్ష్యమే సుఖాలను అనుభవించడమే కదా? అద్భుతమైన పర

కాయ ప్రవేశ విద్య ద్వారా అరుదైన సుఖాలు అమరాయి. వాటి నెలా వదులుకోను?'' అంటూ మిత్రుడి సలహాను పెడచెవిని పెట్టాడు జక్కన్న.

క్రమంగా జక్కన్న స్వార్థానికి తోడు అహంకారం పెరగడంతో అందరితో దురుసుగా ప్రవర్తించసాగాడు. తండ్రి మానసిక క్షోభకు గురయ్యాడు గాని, కొడుకునేమీ అనలేక ఊరుకున్నాడు.

శశికళతో వివాహానికి మూడు రోజులే ఉందనగా సుధాముడు నగర వీధిలో రథాన్ని అతి వేగంగా నడిపించి వృద్ధుడైన రాజబంధువు మరణానికి కారకుడయ్యాడు.

రాజభటులు అతణ్ణి రాజు సమక్షానికి తీసుకువెళ్ళారు. విచారణ జరిపించిన రాజు, అతడికి మరణదండన విధించడంతో పాటు అతడి తండ్రిని నగర పాలకుడి పదవి నుంచి తొలగించాడు. సుధాముడి రూపంలో ఉన్న జక్కన్న మొదట కంగారు పడినప్పటికీ సుధాముడి శరీరాన్ని వదిలిపెట్టడానికి ఇది మంచి అవకాశం అనుకున్నాడు. ఉరికంబం ఎక్కించగానే మంత్రం పఠించి శరీరం నుంచి నిష్క్రమించాడు.

వరుడిగా నిశ్చయించబడిన సుధాముడు మరణ దండనకు గురి కావడంతో శశికళ పట్టరాని దుఃఖంతో తనూ ప్రాణత్యాగానికి పూనుకున్నది.

ఆ సంగతి తెలిసిన నవనీతుడు ఆమెను కలుసుకుని, ''నీ కాబోయే భర్త మరణించ లేదు. నిజానికి అతడు సుధాముడు కాడు,'' అంటూ జరిగినదంతా వివరించాడు.



''ఇప్పుడు నా భర్త ఎక్కడున్నాడు?'' అని అడిగింది శశికళ.

''అతడిప్పుడు నిన్ననే మరణించిన పౌరు గూరి వర్తకుడి కుమారుడు శివదత్తుడి శరీరంలో ఉన్నాడు,'' అన్నాడు నవనీతుడు.

''అద్భుత శక్తిని దుర్వినియోగ పరచగలడని సిద్ధుడు అనుమానించినట్టే జరిగిపోయింది కదా! మరి దీనికి తరుణోపాయం లేదా?'' అని అడిగింది శశికళ.

''ఉన్నది. జక్కన్న దారి తప్పినప్పుడు అతణ్ణి నిలువరించగల మంత్రాన్ని సిద్ధుడు నాకు ఉపదేశించాడు. దాని ద్వారా ప్రస్తుతం శివదత్తుడి శరీరంలో ఉన్న జక్కన్న ప్రాణాలను బయటకు తెప్పించి నువ్వు కోరిన శరీరంలోకి ప్రవేశపెట్టగలను. దాంతో అతడికున్న మంత్ర మహిమ కూడా నశిస్తుంది. సుధాముడు, జక్కన్న వీరిద్దరిలో ఎవరిని

పునర్జీవితుణ్ణి చేయాలో చెప్పు,'' అన్నాడు నవనీతుడు.

''జక్కన్న ప్రాణాన్ని అతడి శరీరంలోనే ప్రవేశపెట్టు. అతణ్ణి భర్తగా స్వీకరించడానికి నాకెలాంటి అభ్యంతరమూ లేదు,'' అన్నది శశికళ.

నవనీతుడి మంత్ర ప్రయోగంతో జక్కన్న శరీరంలో కదలిక వచ్చింది. కొంతసేపటికి లేచి కూర్చుని చుట్టుపక్కల కలయ జూసిన జక్కన్న, ''మంచి పని చేశావు మిత్రమా,'' అని నవనీతుణ్ణి అభినందించి, ''నన్ను క్షమించు,'' అంటూ శశికళ చేయిపట్టుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, శశికళ ధనవంతుడైన సుధాముణ్ణి వదిలి, నిరుపేద అయిన జక్కన్నను కోరుకోవడం బుద్ధిహీనత కాదా? సుధాముడితో వివాహానికి నిశ్చయించ బడిన తను, జక్కన్న చేయిపట్టడానికి నిర్ణ యించడం ధర్మసమ్మతమవుతుందా? అది ఆమె అవివేకానికీ, చపల చిత్తానికీ, తొందర పాటుకూ నిదర్శనం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ధనికులు, పేదలు అన్న భేదం శాశ్వతమైనది కాదు. ఓడలు బళ్ళు కావడం, బళ్ళు ఓడలు కావడం సర్వ సాధారణమైన విషయం. విద్యావంతు డైన జక్కన్నకు నూతన సంపాదనా మార్గాలు వెతుక్కోవడం కష్టం కాదు. పైగా, అది ఇక్కడ సమస్య కాదు. శశికళకు వివాహం నిశ్చయ మయింది సుధాముడి రూపంలోని జక్కన్న తోనే గాని, సుధాముడితో కాదు. ఎందుకంటే శరీరం కన్నా ప్రధానమైనది ప్రాణం. ఆ ప్రాణం జక్కన్నది. అతడి ప్రాణం వేరొక శరీరంలో ఉన్నప్పుడు పరిస్థితుల ప్రభావంతో అతడి ప్రవర్తన దారి తప్పిందేగాని, స్వశరీరంలో ఉన్నప్పుడు అలాంటి ప్రమాదానికి అవకాశం ఉండదు. ఇవన్నీ ఆలోచించడం వల్లే శశికళ జక్కన్నను కోరుకున్నది. ఇందులో అవివేకం, తొందరపాటు ఏమీ లేవు. అది ఏమాత్రం ధర్మవిరుద్ధమైన నిర్ణయం కాదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు రచన]



# 'కుమారి' దేవత



అతీత శక్తులున్నాయని భావించబడే బాలికను దేవతగా కొలిచే 'హిందూ-బౌద్ధ' సంప్రదాయం నేపాల్లో ఈనాటికీ కొనసాగుతున్నది. ఆ సంప్రదాయం ప్రకారం ఇటీవల శ్రియా బజ్రాచార్య అనే ఒక రైతు కూతురిని కొత్త దేవతగా ఎంపిక చేశారు. ఆమెను భక్తపూర్ (ఖాడ్మండు)'కుమారి'గా పిలుస్తారు. ప్రస్తుత 'మావోయిస్టు' ప్రభుత్వం సైతం దీనిని అనుమతించింది. ఈ బాలికకు పన్నెండేళ్ళు పూర్తయిందంటే ఆమె స్థానంలో మరో 'దేవత'ను ఎన్నుకుంటారు.

ఇలా దేవతగా ఎన్నిక కావడానికి-సింహానికి ఉన్నట్టు వక్షస్థలం, జింకపిల్ల కాళ్ళలాంటి కాళ్ళు మొదలైన ముప్పైరెండు శుభ లక్షణాలు కలిగి ఉండాలి. ఇటీవలే బలి ఇచ్చిన మహిషంతో పాటు ఏడవకుండా గడపడం లాంటి కఠోర పరీక్షలలో నెగ్గాలి!

ఈ మధ్య జరిగిన ఒక ఉత్సవ సందర్భంగా శ్రియా బజ్రాచార్య భక్తులకు దర్శనమిచ్చింది!

# తపాలా బిళ్ళల సేకరణ

ఉత్తరాలు పంపడానికి అందరూ తపాలా బిళ్ళలు ఉపయోగిస్తారు. అయితే కొందరు రకరకాల, దేశవిదేశాల తపాలా బిళ్ళలను సేకరించడానికి ఆసక్తి కనబరుస్తారు. ఇలాంటి వారిని 'ఫిలేటలిస్ట్స్' అంటారు. అలా ఆసక్తి కనబరచే అతి పిన్నవయసు 'ఫిలేటలిస్ట్'గా మూషమ్ ఆదర్శ్ గుర్తింపు పొందాడు. ఇటీవల హైదరాబాదులో జరిగిన తొమ్మిదవ ఆంధ్రప్రదేశ్ పోస్టల్ సర్కిల్ ఫిలేటలిక్ ఎగ్జిబిషన్‌లో ఆదర్శ్ సేకరించిన స్టాంపులు ప్రదర్శనకు ఉంచబడ్డాయి. మూడు సంవత్సరాల తొమ్మిది నెలల వయస్కుడైన ఆదర్శ్ ప్రపంచంలోకెల్లా అతి పిన్నవయసు స్టాంప్ కలెక్టర్ అవార్డు అందుకున్నాడు. రజతపతకాన్ని అందుకుని ఢిల్లీలో జరుగనున్న నేషనల్ స్టాంప్స్ ఎగ్జిబిషన్‌లో పాల్గొనే అదృష్టాన్ని పొందాడు.



ప్రపంచపటంలో కనిపించీ కనిపించకుండా ఉండే టోంగా, కుక్ ఐలండ్స్, పిట్‌కాయిర్న్ ఐలండ్స్, ఫిజీ, కిరిబాటి, క్రిస్మస్ ఐలండ్స్, మారిషస్, ఐస్‌లాండ్ మొదలైన దీవులను స్పష్టంగా గుర్తు పడుతున్నాడీ పసివాడు! జంతుప్రదర్శనశాలలోని బైసన్, హిప్పోపొటమస్, రినోజరస్ మృగాలను వాటి రూపాలుగల స్టాంపులతో సహా చెప్పగలుగుతున్నాడు!



# ధ్రువుడు

బలహీనులుగా ఉన్నప్పుడు దుష్ట స్వభావులైన బలవంతుల నుంచి ఈసడింపులు, అవమానాలు ఎదురుకావడం సహజం. అలాంటి సమయంలో బాధతో కుంగిపోకుండా బలాన్ని పెంచుకుంటే అవమానాలు మటుమాయమై అభినందనమాలలు వెతుక్కుంటూ వస్తాయి. మంచితనానికి దీటుగా మనిషి తన శక్తిసామర్థ్యాలను పెంపొందించుకోవడమే విజయానికి రాజమార్గం అన్న జీవిత సత్యాన్ని చాటే మణిదీపం ధ్రువుడి ఉదంతం!

స్వాయంభువ మనువు కుమారుడైన ఉత్తానపాదుడి పెద్దభార్య సునీతి కొడుకు ధ్రువుడు. సురుచి చిన్న భార్య. రాజుకు సురుచి పట్ల అభిమానం ఎక్కువ. ఆమె కొడుకు ఉత్తముడు.

ఒకనాడు ఉత్తానపాదుడు సురుచి కొడుకు ఉత్తముణ్ణి తొడపై కూర్చోబెట్టుకుని ముద్దు చేస్తూండగా ధ్రువుడు అక్కడికి వచ్చాడు. తనుకూడా తండ్రి తొడపై కూర్చోడానికి ఆశ పడ్డాడు. అయితే, అప్పుడే అక్కడికి వచ్చిన సురుచి అడ్డుపడి, ''అలా తండ్రి తొడ మీద కూర్చునే అర్హత నీకు లేదు. నాకన్న బిడ్డకు మాత్రమే ఉన్నది. నీ తండ్రి తొడ మీద కూర్చోదలచినట్టయితే, నువ్వు నా గర్భ వాసాన పుట్టివుండవలసినది, లేలే,'' అంటూ ధ్రువుణ్ణి చేయిపట్టి పక్కకు లాగేసింది.

ఇలా చేసినందుకు ఉత్తానపాదుడు సురుచిని మందలించకుండా, ఆమె చేసిన పనిని ఆమోదించిన వాడిలాగా మౌనంగా ఉండిపోయాడు.

ధ్రువుడికి చాలా కోపం వచ్చింది. దుఃఖం పెల్లుబికింది. రోషం కలిగింది. అక్కడి నుంచి వేగంగా వెళ్ళి తల్లితో జరిగిన సంగతి చెప్పి, వెక్కి వెక్కి ఏడ్చాడు. అయినా సునీతి భర్త

పురాణ వీరకుమారులు - 8

అభిమానాన్ని సంపాదించడంలో సవతితో పోటీ పడలేని నిస్సహాయురాలు. బిడ్డను ఒడిలోకి తీసుకుని ఓదారుస్తూ, ''ఏడవకు నాన్నా! నా కడుపున పుట్టి నలుగురెదుట అవమాన పడ్డావు. నీకూ, నాకూ ఆ దేవుడు తప్ప వేరే దిక్కు లేదు,'' అన్నది.

ఆ మాటతో ధ్రువుడు ధైర్యంగా లేచి నిల బడి, ''అమ్మా నేను తపస్సుకు వెళుతున్నాను. నన్ను ఆశీర్వదించు,'' అన్నాడు.

''తపస్సు చేసి సురుచి కడపున పుట్టాలని వరం కోరుకుంటావా?'' అన్నది తల్లి.

''అమ్మా, నేను నీ కొడుకును. మరెవరికో కొడుకునై పుట్టాలని ఎందుకు కోరుకుం టాను? మనల్ని మనం తక్కువ చేసుకోవడం ఆత్మహత్యతో సమానం. ధ్రువుడి తల్లి ఎంత భాగ్యశాలి అని లోకం కీర్తించేలాగా దిక్కు లకు దిక్కుగా ఉండేలాగా జగద్రక్షకుడైన దేవదేవుణ్ణి వేడుకుంటాను,'' అని చెప్పి ధ్రువుడు అడవికేసి బయలుదేరాడు.

కొంత దూరం వెళ్ళాక నారదుడు ఎదురు పడి ఐదేళ్ళ బాలకుడైన ధ్రువుడి కోరిక విని మొదట అచ్చెరువు చెందాడు. అతడి మనో బలాన్ని మాటలతో పరీక్షించి తృప్తిచెంది, ''మధువనానికి వెళ్ళి 'ఓం నమో నారాయ ణాయ' అనే అష్టాక్షరిని భక్తితో జపిస్తూ తపస్సు చెయ్యి. నీ మనోరథం సిద్ధిస్తుంది,'' అని ఆశీర్వదించాడు.

ధ్రువుడు మార్గమధ్యంలో సప్తర్షులను దర్శించి వారి ఆశీస్సులు కూడా పొంది మధు వనంలో దీక్షగా తపస్సు ప్రారంభించాడు.

ధ్రువుడి తపస్సు కారణంగా తన సింహా సనానికి ముప్పు వస్తుందేమోనన్న అను





మానంతో ఇంద్రుడు ధ్రువుడి తపోభంగానికి భీతి కొలిపించే ఇంద్రజాలం చేశాడు. వజ్రాయుధం ఝుళిపించి ఉరుములు, మెరుపులు, సృష్టించి, పిడుగులు రాల్చి నానా బీభత్సం సృష్టించాడు. ధ్రువుడు దేనికీ చలించలేదు. విష్ణు చక్రం ధ్రువుడిపై తిరుగుతూ అన్నిటినీ తూలగొట్టింది.

ధ్రువుడి తపస్సుకు మెచ్చుకుని విష్ణువు ప్రత్యక్షమై, ''ఏం వరం కావాలో కోరుకో,'' అన్నాడు.

ధ్రువుడు విష్ణువును తనివితీరా చూస్తూ పరమానందం చెంది, ''తుమ్మెద పద్మాన్ని అంటి పెట్టుకుని ఉండే విధంగా, నీ మధుర మందహాస వదన పద్మాన్ని సదా చూస్తూ ఉండాలని తప్ప నాకు మరే కోరికా లేదు,'' అన్నాడు.

విష్ణువు సంతోషించి, 'మొదట నీ రాజ్యానికి వెళ్ళి ధర్మపాలన సాగిస్తూ నీ కర్తవ్యాన్ని నిర్వర్తించు. జీవిత సుఖాలను అనుభవించాక, నా రూపమైన విశ్వానికి శిరోభాగంగా ఉండే ధ్రువపదాన్ని చేరుతావు. కల్పాంతరాలు గతిస్తున్నా చెక్కు చెదరని అచలపదాన్ని అలంకరించి నన్ను చూస్తూ వెలుగొందుతూంటావు,'' అని వరమిచ్చాడు.

ధ్రువుడు రాజ్యానికి తిరిగి వచ్చిన కొన్నాళ్ళకు తండ్రి ఉత్తానపాదుడు అతనికి రాజ్యం అప్పగించి తపస్సుకు వెళ్ళిపోయాడు.

ధ్రువుడు ప్రజారంజకంగా రాజ్య పాలన చేయసాగాడు.

ధ్రువుడి తమ్ముడు ఉత్తముడు ఒకనాడు వేటకు వెళ్ళగా దుష్టస్వభావులైన యక్షులు విరుచుకుపడి అతణ్ణి హతమార్చారు.

సురుచి పుత్రశోకంతో అక్కడికి వెళ్ళి అరణ్యంలో రగుల్కొన్న కార్చిచ్చులో చిక్కుకుని కాలిపోయింది.

ధ్రువుడు యక్షనిర్మూలనం చెయ్యడానికి అలకా నగరాన్ని ముట్టడించాడు. యక్షులు క్షుద్ర మాయాజాలాన్ని ప్రయోగించారు. ధ్రువుడు నారాయణాస్త్రంతో వాటిని పటాపంచలు చేసి విజృంభించాడు. చివరికి యక్షుల నాయకుడైన కుబేరుడు శరణాగతుడై ధ్రువుణ్ణి మంచి చేసుకుని అనేక సంపదలిచ్చి పంపాడు.

ధ్రువుడు ఆదర్శపాలన సాగించి, స్వాయంభువ మనువంశానికి కీర్తి తెచ్చాడు. వంశాభివృద్ధికి గుణవంతులైన పలువురు కుమారులను కన్నాడు. చిరకాలం రాజ్యం చేసి జ్యేష్ఠ కుమారుడికి పట్టంకట్టి బదరికావనం చేరుకున్నాడు. అక్కడ నిరంతరం విష్ణువును ధ్యానిస్తూ బంగారు శరీరాన్ని పొందాడు.

విష్ణు భటులు విమానం తెచ్చారు. ధ్రువుడు వారితో, ''మా అమ్మను ఇక్కడే వదిలి నేను మాత్రం ఉన్నత పదానికి ఎలా రాగలను,'' అన్నాడు. భటులు ముందుగా ఒక దివ్య విమానంలో ధ్రువమండలానికి వెళుతూన్న సునీతిని ఆయనకు చూపించారు. అప్పుడు ధ్రువుడు సంతోషంగా విమానం ఎక్కి ధ్రువ పదాన్ని చేరాడు. ఏడేడు పధ్నాలుగు లోకాలకు మీదుగా విశ్వశిఖరాగ్రంపై ధ్రువుడు దిక్కులకు దిక్కుగా అచలపద నక్షత్రంగా ప్రకాశిస్తున్నాడు.

అనుకున్నది సాధించాలంటే ప్రయత్నం ప్రధానం. భూగోళమంతటి గాఢాంధకారమే అయినా చిన్న దీపకళిక వెలుతురును అడ్డుకోజాలదు. గోరంత దీపమే కొండంత వెలుగునిస్తుంది. చిగురంత ఆశే జీవితాన్ని ముందుకు నడిపిస్తుంది; పరిపూర్ణతను ప్రసాదిస్తుంది అని చాటిన ధీరోదాత్తుడు ధ్రువుడు.

దృఢ సంకల్పం, దీక్షాదక్షతలు ఉండాలే గాని, చిన్నా పెద్దా అనే తారతమ్యాలు లేకుండా ఎంతటిదైనా సాధించలేనిదంటూ ఉండదన్న అద్భుత సత్యాన్ని చాటుతూ దివ్యప్రకాశంతో నక్షత్ర రూపంలో వెలుగొందుతూన్న పురాణ వీరకుమారుడు ధ్రువుడు!






## స్వాగతం-వీడ్కోలు



ముంబాయిలోని ముఖ్యమైన నిర్మాణమైన 'గేట్ వే ఆఫ్ ఇండియా' బ్రిటిష్ పాలన ఆగమనానికీ, తిరోగమనానికీ స్వాగతం-వీడ్కోలు పలికి సాక్ష్యంగా నిలిచి ఉన్నది. 1911లో ఐదవ కింగ్ జార్జ్-క్వీన్‌మేరీ ఓడలో వచ్చినప్పుడు వారికి ఘనంగా స్వాగతం పలకడానికి 'గేట్ వే ఆఫ్ ఇండియా' నిర్మించబడింది. ముప్పై యేడేళ్ళ తరవాత పాశ్చాత్య పాలకులకు ఇక్కడి నుంచే వీడ్కోలు పలకడం కూడా జరిగింది. భారతదేశంలోని సోమర్‌సెట్ లైట్ ఇన్‌ఫెంట్రీ అనే బ్రిటిష్ చివరి సైనికదళం 1948 ఫిబ్రవరి 28వ తేదీ ఇక్కడి నుంచే ఇంగ్లాండుకు బయలుదేరి వెళ్ళింది.

## సూర్య దేవాలయం

మన రాష్ట్రంలోని అరసవిల్లి సూర్యదేవాలయంలాగే తమిళనాడు కుంభకోణం సమీపంలో సూర్యుడికని ప్రత్యేకంగా సూర్యనార్ కోయిల్ అనే ఒక దేవాలయం ఉన్నది. దీనిని కులోత్తుంగ చోళుడు (1075-1120) నిర్మించాడని చెబుతారు. ఆయన కాలంలో చేయబడిన ఒక శిలాశాసనం 'కులోత్తుంగ చోళ మార్తాండ ఆలయం'గా దీనినీ పేర్కొంటున్నది. ఆలయంలో ఏడు గుర్రాలు పూన్చిన రథంలో సూర్యనారాయణ రూపం కనిపిస్తుంది. మూడు అంతస్థుల ఆలయ గోపురం పదహారు మీటర్ల ఎత్తు ఉన్నది. ఈ చుట్టు పక్కల ప్రాంతాలలో తొమ్మిది గ్రహాలకూ విడివిడిగా ఆలయాలు ఉండడం చెప్పుకోతగ్గ మరో విశేషం.





బీర్బల్ కథలు : 17

# రాజముద్రిక ప్రభావం

ఆస్థానంలోని ప్రముఖులందరిలోకీ బీర్బల్ పట్ల అక్బర్ చక్రవర్తి అమిత ఆదరాభిమానాలు కనబరచేవాడు. సమయస్ఫూర్తిగల చతురోక్తులతో, వినోదాత్మకమైన కథలతో బీర్బల్ తరచూ చక్రవర్తికి వినోదం కలిగించేవాడు. అలా ఒక నాడు బీర్బల్ చక్కని హాస్యోక్తితో అక్బర్ చక్రవర్తిని కడుపుబ్బ నవ్వించాడు. పకపకా నవ్విన అక్బర్, ''చాలా చక్కగా చెప్పావు బీర్బల్. నీ హాస్యచతురత అమోఘం. తెలివి తేటలు అద్భుతం,'' అంటూ మెచ్చుకున్నాడు.

''అవి సహజసిద్ధంగా వచ్చినవి ప్రభూ! మన ఉభయుల మధ్య ఉన్న తేడా కూడా అదే కదా షహేన్‌షా! తమరు చక్రవర్తి కుమారులు. తండ్రి అనంతరం తమరు చక్రవర్తులయ్యారు. తమ అధికారం, శక్తి తమ సొంత ప్రయత్నాల కారణంగా వచ్చినవి కావు. నా శక్తి నాలోపలి నుంచి వస్తుంది. తమ శక్తి వెలుపలి నుంచి వస్తుంది షహేన్‌షా,'' అన్నాడు బీర్బల్ గొప్పగా.

''వెలుపలి నుంచా?'' అన్నాడు చక్రవర్తి కాస్త తీవ్రంగా.

''నా తెలివితేటలను ఎవరూ అపహరించలేరు. రాజ్యాధికారం అలా కాదు కదా. రాజముద్రికలు, ఉంగరాలు చక్రవర్తులకుగల శక్తిని గురించీ, అధికారాల గురించీ ప్రపంచానికి చాటుతాయి,'' అన్నాడు బీర్బల్.

''నీ మాటలోని నిజాన్ని ప్రత్యక్షంగా నిరూపించు. లేకుంటే కఠినశిక్ష తప్పదు,'' అన్నాడు అక్బర్ ఆవేశంగా నిట్టూరుస్తూ.

బీర్బల్ వినయంగా వంగి నమ్కరించి, చిన్న నవ్వుతో అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఆనాటి రాత్రి అతడు ఆ విషయం గురించి ఆలోచిస్తూ చాలాసేపుగడిపాడు. ఆఖరికి ఒక నిర్ణయానికి వచ్చి, ''ఇది తప్పక పనిచేస్తుంది,'' అనుకుని నిద్రకు ఉపక్రమించాడు.

మరునాడు ఎప్పటిలాగే బీర్బల్ సభకు హాజరయ్యాడు. చక్రవర్తి అతడి అభిప్రాయాలను సావధానంగా వింటూ, నెమ్మదిగా మాట్లాడాడు. బీర్బల్ కూడా మామూలుగానే చతురోక్తులు విసురుతూ చక్రవర్తితో సహా సభికులందరినీ నవ్వించడానికి ప్రయత్నించాడు. చక్రవర్తి నవ్వడానికి ప్రయత్నించాడు గాని, అంతకు ముందున్న సహజ స్పందన కనిపించలేదు. పరస్పరం నిర్లిప్తంగా గౌరవించుకున్నప్పటికీ ఒకరినొకరు దేగకళ్ళతో చూసుకోసాగారు.

అలాగే పక్షం రోజులు గడిచిపోయాయి. అక్బర్ చక్రవర్తి ఏరోజు ఏం చేస్తాడన్నది బీర్బల్‌కు

బాగా తెలుసు. భద్రతా ఏర్పాట్లు, ప్రజల స్థితి గతులు ఎలా ఉన్నాయో స్వయంగా తెలుసు కోవడానికి చక్రవర్తి వారానికోసారి రాత్రుల్లో మారువేషంలో రాజధానీనగర సంచారానికి వెళ్ళేవాడు.

అలాంటి సమయాలలో ఆయన ధరించే వేషాలు చాలా సహజంగా, అసలు గుర్తు పట్ట లేని విధంగా ఉండేవి. అందుకు ముఖ్యకార కుడు అషారఫ్ అనే చక్రవర్తి విశ్వాసపాత్రుడు. వివిధ వేషాలు తీర్చిదిద్దడంలో సిద్ధహస్తుడు. అందుకు అతడు రకారకాల కృత్రిమ శిరో జాలంకరణలు, మీసాలు, గడ్డాలు, దుస్తులు, రంగులు, కుంచెలు ఉపయోగించేవాడు. అలం కరణ సహజసిద్ధంగా ఉండడానికి అషారఫ్ బీర్బల్ నుంచి అప్పుడప్పుడు సూచనలు, సల హాలు, చిట్కాలు అడిగి తెలుసుకునేవాడు. అందువల్ల రాజు నగరసంచారానికి ఏ వేషంలో వెళ్ళేదీ, బీర్బల్‌కు ముందుగానే తెలిసిపోయేది.

ఒక శనివారం ఉదయం ఇంటికి వచ్చిన అషారఫ్‌ను చూడగానే, ''తెల్లవారక ముందే వచ్చావేంటి? గొప్పవిశేషమే ఉంటుంది,'' అని నవ్వుతూ పలకరించాడు బీర్బల్.

''అవును. చక్రవర్తి ఈ రాత్రి నగర సంచారా నికి వెళ్ళాలంటున్నారు. ఆయనకు బిచ్చగాడి వేషం వేద్దామనుకుంటున్నాను,'' అన్నాడు.

''చక్రవర్తిని క్షణంలో బిచ్చగాడిగా మార్చడం నీ ఒక్కడికే సాధ్యం,'' అన్నాడు బీర్బల్.

ఆ మాటకు ఫక్కున నవ్విన అషారఫ్, ''తమరే అందుకు తగిన చిట్కాలు, సూచనలు ఇవ్వాలి. వాటికోసమే వచ్చాను,'' అన్నాడు.

''అక్కడక్కడ చిరిగిపోయి, కుట్లు వేసిన ముతక పాతబట్టలను కట్టబెట్టు. మెడిమల వద్ద చిరిగి పోయిన పాత చెప్పులు వేసుకునేలా చూడు. పాతగుడ్డ తలపాగా పెట్టుకుంటే చక్ర వర్తి గుర్తుపట్టలేనంతగా మారిపోగలడు. ఆ తరవాత ఒక భుజానికి జోలెను తగిలించి, చేతికి నలిగిపోయిన సత్తు గిన్నె ఇవ్వు. ఇక చూసుకో. చక్రవర్తి అసలు బిచ్చగాడిలా కనిపిం చకపోతే నన్ను అడుగు,'' అన్నాడు బీర్బల్.

''చాలా కృతజ్ఞతలు. ఇంకా ఏమైనా చిట్కాలు ఉంటే చెప్పు,'' అన్నాడు అషారఫ్ మళ్ళీ.

''షహేన్‌షా ముఖంలోనూ, మోచేతుల మీదా ముడతలు, వాతలు కనిపించేలా రంగులు వెయ్. ఆపైన తిరుగుండదు,'' అన్నాడు బీర్బల్.

అషారఫ్ తలపంకించి, వంగి సలాం చేసి అక్కడి నుంచి బయలుదేరాడు. ''ఇక నా పని ఆరంభించాలి,'' అనుకున్నాడు బీర్బల్.

ఆ రోజు పొద్దు పోయి, చీకటి పడుతుం డగా తను బిచ్చగాడి వేషం వేసుకోడానికి భార్య సాయం కోరాడు.

''ఏమిటీ! బిచ్చగాడి వేషమా?'' అంటూ ఆశ్చర్యపోయింది భార్య.



## మన దేశం క్విజ్



భారతీయ సాహిత్యం గురించి ఈ నెల క్విజ్‌లో తెలుసుకుందాం

1. 'గీతా రహస్యం' అనే భగవద్గీత వ్యాఖ్యానం ఎవరు రచించారు? ఆయన 20వ శతాబ్దానికి చెందిన జాతీయ నాయకుడు.
2. మైథిలీ శరణ్ గుప్త సుప్రసిద్ధ రచన ఏది?
3. జ్ఞానపీఠ పురస్కార ప్రథమ గ్రహీత ఎవరు?
4. 'పంచతంత్ర' గ్రంథకర్త ఎవరు? ఎప్పుడు రచించాడు?
5. 'శఖారామ్ బిందర్', 'ఘాసీ రామ్ కొత్వాల్' అనే సుప్రసిద్ధ నాటకాలను రచించినవారెవరు?
6. భారతదేశ సుప్రసిద్ధ క్రీడాకారుడు ఇ ఎ ఎస్ ప్రసన్న జీవిత చరిత్ర పేరేమిటి?
7. ఏ గ్రంథ రచనకు రవీంద్రనాథ టాగూరుకు నోబెల్ బహుమతి ఇవ్వబడింది? ఏ సంవత్సరంలో?
8. 'అక్బర్‌నామా'ను ఎవరు రచించారు?
9. 'సారే జహా సె అచ్ఛా...' గీత రచయిత ఎవరు?

(సమాధానాలు 74వ పేజీలో)

''అవును. నేను రాత్రి తెల్లవార్లూ బిచ్చగాడి వేషంలో నగరమంతా కలయతిరిగి బిచ్చగాళ్ళ కష్టనష్టాలు తెలుసుకోవాలి. ఆ తరవాత వాటిని షహేన్‌షాకు తెలియజేయాలి. బిచ్చగాళ్ళ కష్టాలు పోగొట్టాలి,'' అన్నాడు బీర్బల్.

''మీవి అన్నీ వింతవింత ఆలోచనలే,'' అంటూ భార్య బీర్బల్‌కు బిచ్చగాడి వేషం వేయడానికి పూనుకున్నది. రంగు వెలిసిపోయిన పాత బట్టలను వెలికి తీసింది. అవి అక్కడక్కడ చిరిగిపోయి ఉన్నవి. చిరుగులను రంగు రంగుల దారాలతో కుట్టింది.

వాటిని ధరించిన బీర్బల్, ''మరి, ముఖం చేతుల మాటేమిటి? ముడతలు, వాతలు కనిపించేలా చెయ్. రంగులతో ముఖం మీద గాట్లు, చేతులమీద వాతలు పెట్టు,'' అన్నాడు.

ఆమె అలాగే చేయడంతో అచ్చం బిచ్చగాడిలా తయారైన బీర్బల్ చంకకు జోలె తగిలించుకుని, సొట్టలు పడ్డ సత్తుగిన్నె తీసుకుని చిరిగిన చెప్పులు తొడుక్కుని, ''నా కోసం ఎదురు చూడకు. ఎప్పుడు వస్తానో ఏమో! కొత్త బిచ్చగాడు పొద్దెరుగడు కదా? నువ్వు వేళకు తిని, భద్రంగా పడుకో,'' అని భార్యను హెచ్చరించి అక్కడి నుంచి బయలుదేరి రాజభవనం కేసి నడవసాగాడు. భవనం ప్రధాన ద్వారానికి వంద గజాల దూరంలో ఆగాడు. చీకటిగా ఉన్న చోటును చూసుకుని అక్కడికి వెళ్ళి నిలబడ్డాడు.

అతడు అట్టేసేపు వేచి ఉండవలసిన అవసరం కలగలేదు. రాజద్వారం తెరుచుకున్నది. ఒక బిచ్చగాడు వెలుపలికి అడుగుపెట్టాడు. ద్వారపాలకులు అతనికి వంగి సలాం చేశారు.

బిచ్చగాడి వేషంలోని చక్రవర్తి తనను దాటుకుని వెళ్ళేంతవరకు మాట్లాడకుండా చీకటిలో

నిలబడ్డ బీర్బల్, ఆయన తనను దాటుకుని వెళ్ళి నాలుగడుగులు వేయగానే, ''ఆగు, మిత్రమా! నేనూ వస్తాను,'' అన్నాడు.

''ఎవరు నువ్వు?'' అడిగాడు చక్రవర్తి అధికారం నిండిన కంఠస్వరంతో.

''ఏమిటీ, షహేన్‌షాలా ప్రశ్నిస్తున్నావు. నువ్వు బిచ్చగాడివి. ఆ విషయం మరిచి పోకు. బిచ్చగాడిలా మాట్లాడడం నేర్చుకో. లేకుంటే దమ్మిడీ దొరకదు. గుర్తుంచుకో,'' అన్నాడు బీర్బల్ గొంతు మార్చి.

''నువ్వు ఎవరు?'' అని అడిగాడు చక్రవర్తి మళ్ళీ కంఠస్వరం కాస్త తగ్గించి.

''నీలాంటి బిచ్చగాణ్ణే,'' అన్నాడు బీర్బల్.

''నేను బిచ్చగాణ్ణి కాను,'' అన్నాడు చక్రవర్తి ఆవేశంతో.

''మరెవరు? చక్రవర్తివా?'' అని అడిగాడు బీర్బల్ హేళనగా.

''అవును, చక్రవర్తినే. నగర సంచారానికి వెళుతున్నాను,'' అన్నాడు అక్బర్.

''నువ్వు అలా చెబితే నమ్మడానికి నేను వెర్రివెంగళప్పను కాను,'' అన్నాడు బీర్బల్.

''నేనెవరో నిరూపిస్తాను,'' అన్నాడు అక్బర్.

''వెంటనే ఆ పని చెయ్. లేకుంటే అధికారులకు అప్పగించగలను,'' అని హెచ్చరించాడు బీర్బల్.

అక్బర్ చక్రవర్తి ఆగ్రహంతో ఊగి పోయాడు. తీవ్ర అవమానానికి లోనైనట్టు కుంచించుకు పోయాడు. ''నీలాంటి ఊరూరూ తిరిగే బిచ్చగాడికి నేనెవరని ఎందుకు నిరూపించాలి?'' అన్నాడు.

''ఎందుకంటే, ఇద్దరం ఒకే గూటి పక్షులం గనక!'' అన్నాడు బీర్బల్.



''ఏమిటీ పొగరుబోతు కూతలు!'' అంటూ చక్రవర్తి రాజముద్రిక గల ఉంగరాన్ని తీసి చూపాడు.

''అది నిజమైనదేనా అని నన్ను పరిశీలించి చూడనీ,'' అంటూ దాన్ని గభాలున తీసుకున్నాడు బీర్బల్.

కొంతసేపు అటూ ఇటూ తిప్పిచూస్తూ, ''దీన్ని నీకు ఎవరిచ్చారు?'' అని అడిగాడు బీర్బల్.

''ఎవరో ఇవ్వడమేమిటి? అది నాదే. నేనే షహేన్‌షా,'' అన్నాడు అక్బర్.

''నువ్వు చెప్పేది నన్ను నమ్మమంటావు?'' అంటూ నవ్వాడు బీర్బల్.

''నీ తల తెగిపడకుండా ఉండాలంటే వెంటనే ఆ నవ్వును ఆపు, మూర్ఖుడా!'' అని

హెచ్చరించాడు అక్బర్ ఆవేశంతో. అంతలో అటు వైపుగా వచ్చిన రాత్రి కాపలా భటులు దేన్ని గురించి ఆ ఇద్దరు వాదులాడుకుంటున్నారో తెలుసుకోవడానికి వాళ్ళ దగ్గరికి వచ్చారు.

''వీణ్ణి బంధించి దూరంగా లాక్కు వెళ్ళండి. వీడొక దొంగ,'' అంటూ బీర్బల్ అక్బర్ కేసి చేయి చూపాడు.

''నేను షహేన్‌షా, బిచ్చగాడిలా మారు వేషంలో ఉన్నాను,'' అన్నాడు అక్బర్.

''వాడు అబద్ధం చెబుతున్నాడు. రాజముద్రిక గల ఉంగరం నా దగ్గర ఉన్నది చూడండి,'' అంటూ బీర్బల్ రాజముద్రికను ఒక భటుడికి చూపాడు.

దానిని చూడగానే భటుడు బీర్బల్‌కు వంగి నమస్కరించి, చక్రవర్తి అని గుర్తించకుండా బిచ్చగాడి కేసి కోపంగా చూస్తూ పట్టుకో బోయాడు. కీడు శంకించిన అక్బర్ అక్కడి నుంచి వేగంగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.



''ఇక వాణ్ణి వదిలెయ్యండి. పిచ్చివాడేదో వాగాడు,'' అంటూ భటుల్ని అడ్డుకున్నాడు బీర్బల్.

మరునాడు యథాప్రకారం ఆస్థానానికి వెళ్ళిన బీర్బల్, చక్రవర్తిని ఆంతరంగిక మందిరంలో ఒంటరిగా కలుసుకోవాలని విన్నవించాడు. చక్రవర్తి ఆజ్ఞ పొంది అధికారులు అనుమతించగానే అక్కడికి చేరిన బీర్బల్ మోకాళ్ళ మీద వంగి నమస్కరించి, ''రాత్రి మీరు రాజముద్రికను పోగొట్టుకున్నారా ప్రభూ?'' అని అడిగాడు.

''అది నీకెలా తెలుసు?'' అని అడిగాడు చక్రవర్తి ఆశ్చర్యంగా.

రాత్రి జరిగినదంతా పూసగుచ్చినట్టు వివరించిన బీర్బల్, గంభీరంగా మారిన చక్రవర్తి ముఖం చూస్తూ, ''ప్రభువులు క్షమించాలి. రాజముద్రిక శక్తి గురించి నిరూపించమని కొన్ని రోజుల క్రితం ప్రభువులు నన్ను ఆజ్ఞాపించారు కదా? దానిని నిరూపించడానికే అలాచేశాను. రాజముద్రిక నా దగ్గర ఉండడం వల్లనే భటులు నా ఆజ్ఞను పాటించారన్నది ప్రభువులు ప్రత్యక్షంగా చూశారు కదా?'' అంటూ రాజముద్రిక గల ఉంగరాన్ని చక్రవర్తి ముందుంచాడు.

వచ్చే ఆగ్రహాన్ని ఆపుకోవడానికి ప్రయత్నిస్తూ ''బీర్బల్,'' అంటూ తల పంకించిన అక్బర్ చక్రవర్తి పకాలున నవ్వుతూ, ''నువ్వు మహా ఘటికుడివి! నిజమే! నా అధికారం సింహాసనం, కిరీటం, రాజముద్రికలు మొదలైన రాజలాంఛనాల మీద ఆధారపడింది. నీ తెలివితేటలు నీ సొంతం. అదే నీ బుద్ధి నెవ్వరూ దొంగిలించలేరు!'' అని పొగుడుతూ పట్టుసంచీ నిండుగా బంగారు మొహరీలను కానుకగా అందించాడు. -(ఆర్.కె.మూర్తి)

ఉదయ తారలు:

# నిమిషా మోహన్



- నిమిషా రోల్‌మోడల్: రోజర్ ఫెడెరర్.
- రోజూ ఉదయం మూడు గంటలు, సాయంకాలం మూడు గంటల సేపు నిమిషా ప్రాక్టీస్ చేస్తోంది.
- బెంగళూరులోని టెన్నిస్ అడ్వాంటేజ్‌లో శిక్షణ పొందుతోంది.
- నిమిషా కోచ్: జాన్ ఉత్తప్పా
- ఆమెతో స్నేహం చెయ్యాలనుకుంటున్నారా? పెరుగన్నం మాత్రం పెట్టకండి. అది ఆమెకు నచ్చదు.



గెలుపొందిన మేజర్ టైటిల్స్

ఏఐటిఏ సూపర్ సిరీస్ (యు-14 సింగిల్స్)-2005
ఆలిండియా సూపర్ సిరీస్ (యు-18 సింగిల్స్)-2006
యుఎస్‌టిఏ లెవెల్ 1బి ఛాంపియన్‌షిప్, న్యూయార్క్, యుఎస్‌ఏ (యు-18 సింగిల్స్) -2008
ఐటిఎఫ్ జూనియర్ (జిఆర్ 5) చెన్నయ్ & హైదరాబాద్-2008
డిఎస్‌సిఎల్ నేషనల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ (యు-18 సింగిల్స్)-2008

పదిహేడేళ్ళ నిమిషా మోహన్ ఇప్పటికే 2 అంతర్జాతీయ యు-18 టైటిల్స్‌తో సహా 15 టైటిల్స్ సాధించింది. పదేళ్ళ ప్రాయంలోనే ఆమె టెన్నిస్ ఆడడం ప్రారంభించింది. ఆమె తల్లి ప్రోత్సాహమే అందుకు ప్రధాన కారణం. ఆమెను వెంటబెట్టుకువెళ్ళి వీలైనన్ని ఎక్కువ కార్యకలాపాలలో పాలుపంచుకునేలా చేసేది. బెంగళూరులోని శ్రీ భగవాన్ మహావీర్ జైన్ కాలేజీలో పి.యు.సి. తొలి సంవత్సరం చదువుతూన్న నిమిషా, ఉదయం ప్రాక్టీస్ చేయవలసి ఉండడంతో తరగతులకు ఆలస్యంగా వెళ్ళడానికి ప్రత్యేక అనుమతిని పొందింది. అలా అని చదువుల్లో వెనక బడకూడదు కదా. అందుకోసం ట్యూషన్ క్లాసులకు వెళుతుంది.

ఆమె ఈడు పిల్లలు డయెట్ పెప్సీ, జంక్‌ఫుడ్ పట్ల ఆసక్తి చూపుతారు. అయితే, ఆమె మాత్రం తను తీసుకునే ఆహారంలో కావలసినన్ని ప్రోటీన్లు, కార్బొహైడ్రేట్లు ఉండేలా జాగ్రత్త పడుతోంది. ప్రాక్టీస్ తరవాత రోజూ 45 నిమిషాలపాటు ఫిట్‌నెస్ వ్యాయామాలు చేస్తుంది. వారానికి మూడుసార్లు జిమ్‌కు వెళుతుంది. టెన్నిస్‌లాంటి క్రీడలకు మంచి శారీరక బలం అవసరం గనక, ఫిట్‌నెస్‌కు అంతటి ప్రాముఖ్యతనిస్తోంది.

ఆమె పాల్గొన్న వాటిలో చాలా కష్టమైనది ఏది? అని తెలుసుకోవాలనుకుంటున్నారు కదూ? ''ప్రతి మ్యాచ్ ఒక ఛాలెంజ్. ఏకాగ్రతో చాలా జాగ్రత్తగా ఆడాలి. ఆడేప్పుడు ఫలితాల కోసం ఆలోచించకూడదు!'' అదీ నిమిషా సమాధానం!

ఉన్నత శిఖరాలను అందుకోవడానికి ఉరకలువేసే ఉత్సాహాన్ని కనబరుస్తున్న నేటి యువతరం తారక మంత్రాన్నే నిమిషా కూడా ప్రతిధ్వనిస్తోంది, ''కష్టపడి పనిచేయండి. అనుకున్నవి సాధించడానికి శ్రమించండి. ఆనందంతో శ్రమించండి! అన్నిటికీ మించి మీపై మీరు విశ్వాసం ఉంచండి!''

# అభిప్రాయం వెనక అభిప్రాయం!

ఒకనాడు మాణిక్యం అనే పొరుగూరి వ్యక్తి ఏదో పనిమీద రామాపురానికి వచ్చాడు. ఆ సమయంలో రచ్చబండ వద్ద కొందరు గ్రామస్థులు ఊరి పొలిమేరలో మకాంచేసిన సదానందుడనే సాధువు గురించి మాట్లాడు కుంటున్నారు. భూమయ్య అనే కామందు, ''ఈ సాధువులు సన్యాసులు ఎవళ్ళను ఉద్ధరించడానికి ఇలా ఊళ్ళు పట్టుకుని తిరుగుతారో తెలియదు. వాళ్ళు చెబితేనే మనకు భక్తి కలుగుతుందా? నీళ్ళు పల్లానికే ప్రవహించును. నిజమే పలుకవలెను-అంటూ వాళ్ళు వల్లించే వేదాంత సత్యాలు, నీతి సూత్రాలు ఎవరికి తెలియవని? అలాంటి వారి దగ్గరికి వెళ్ళడం అంటే డబ్బూ, సమయం రెండూ దండగ!'' అన్నాడు.

దాన్ని విన్న గ్రామస్థులు మరికొంతసేపటికి పళ్ళూ, పూలూ తీసుకుని సదానందుడి దర్శనానికి బయలుదేరారు. దాన్ని చూసి ఆశ్చర్యపోయిన మాణిక్యం వాళ్ళతో, ''అదేంటి! మీ ఊరి పెద్దమనిషి సాధువుల గురించి చెప్పింది విని కూడా ఇలా బయలుదేరారేంటి? ఆయన అభిప్రాయానికి మీరిచ్చే విలువ ఇదేనా?''అన్నాడు.

గ్రామస్థులు నవ్వి, ''నువ్వు ఊరికి కొత్తవాడివి కదా. ఆయన స్వభావం తెలియక ఇలా అడుగుతున్నావు. అయినా, ఎవరి అభిప్రాయానికైనా విలువ, వారిపై ఎదుటివారికి గల అభిప్రాయం బట్టే కదా ఉంటుంది!'' అన్నారు.

భూమయ్య ఎటువంటివాడో గ్రహించిన మాణిక్యం, వాళ్ళతో కలిసి తనూ సాధువు దర్శనానికి బయలుదేరాడు.

-భీమవరపు పురుషోత్తం



# కుతుబ్ మీనార్-చుట్టు పక్కల కట్టడాలు



కుతుబ్ ప్రాంగణంలో సుప్రసిద్ధమైన కుతుబ్ మీనార్‌తో సహా పలు కట్టడాలున్నాయి. బానిసవంశ ప్రథమ పాలకుడైన కుతుబ్-ఉద్దీన్-ఐబాక్ కాలంలో దీని నిర్మాణం ఆరంభమయింది. ఆయన వారసుడైన ఇల్తుమిష్, ఆ తరవాతి పాలకులైన అలా-ఉద్దీన్-ఖిల్జీ మున్నగువారు దీని పైఅంతస్థులను నిర్మించారు. కుతుబ్ మీనార్ 72.5 మీ. ఎత్తు ఉన్నది. దీని అడుగు పీఠం వ్యాసం 14.3 మీ. పై అంతస్థ వెడల్పు 2.7 మీ.

అలాయ్‌గేట్ ప్రధాన ద్వారం. అలా-ఉద్దీన్-ఖిల్జీ దీనిని నిర్మించాడు. గుమ్మటంగల సింహ ద్వారం ఎర్ర సున్నంరాయి, లోపల చలవ రాళ్ళతో, అందమైన శిలా ఫలకాలతో అలంకరించబడి ఉన్నది. ఇది దీని నిర్మాణంలో పాల్గొన్న టర్కీ శిల్పకారుల అద్భుతమైన కళా నైపుణ్యానికి చక్కటి తార్కాణంగా భాసిల్లుతున్నది.

కుతుబ్ మీనార్ కన్నా రెండింతల ఎత్తుతో అలాయ్ మినార్‌ను నిర్మించాలని అలా ఉద్దీన్ ఖిల్జీ దాని నిర్మాణాన్ని ప్రారంభించాడు. అయితే, అది పూర్తయ్యేలోగా ఆయన మరణించడంతో అది అర్ధంతరంగా ఆగిపోయింది. 24.5 మీ. ఎత్తయిన తొలి అంతస్థు శిథిలావస్థలో కనిపిస్తున్నది.

కుతుబ్ ప్రాంగణంలోని ఇనుపస్తంభం ప్రపంచ ప్రసిద్ధిగాంచిన లోహనిర్మాణాలలో ఒకటి. అది 98 శాతం ఇనుముతో నిర్మించబడింది. 1600 సం.లు గడిచినా తుప్పు పట్టకుండా చక్కగా నిలిచి ఉన్నది. 7 మీ. ఎత్తయిన ఈ స్తంభాన్ని రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుడు (క్రీ.శ. 375-414) నెలకొల్పాడు. స్తంభానికి వీపును ఆనించి రెండు చేతులతో వెనకు కౌగిలించుకున్నట్టు పట్టుకోగలిగిన వారి కోరికలు నెరవేరుతాయని ఒక విశ్వాసం!

యునెస్కో 1993వ సం.లో (ఇండో-ఇస్లామిక్ నిర్మాణ కళకు ఉదాహరణగా) దీనిని ప్రపంచ వారసత్వ స్థలాల జాబితాలో చేర్చుకున్నది.

ఉదయం నుంచి సాయంకాలం వరకు చూడడానికి అనుమతిస్తారు. ప్రవేశ రుసుము : భారత పౌరులకు సార్క్ దేశాలవారికి రూ. 10. ఇతరులకు 5 అమెరికన్ డాలర్లు. పదిహేనేళ్ళ లోపు పిల్లలకు ఉచితం.

# కాగల్ గ్రామ తిమింగిలం

మన దేశంలో వివిధ ప్రాంతాలలో నివసిస్తూ విభిన్న భాషలు మాట్లాడే వారయినప్పటికీ మన స్నేహితులందరికీ ఈ కథను చెప్పాలనుకుంటున్నాను.

నా పేరు సునీ. పన్నెండేళ్ళ అమ్మాయినైన నేను కాగల్ గ్రామంలో ఉంటున్నాను. అది కర్నాటక రాష్ట్రం పడమటి తీరంలో ఉంది. నేను మా ఊళ్ళోని ప్రభుత్వ పాఠశాలలో చదువుకుంటున్నాను. ఇద్దరు స్త్రీలు వచ్చి మా బడిలో 'నేచురల్ క్లబ్' అనే సంస్థను ఏర్పాటు చేసేంతవరకు ప్రశాంత సముద్రంలోని అలల్లా రోజులు సాఫీగా గడిచిపోతూ ఉండేవి. నేను కూడా ఆ క్లబ్బులో చేరాను. వారి కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొనడం మొదలు పెట్టాను. అప్పటి నుంచి నాలో అంతకుముందు లేని కొత్త ఉత్సాహం, ఉత్తేజం పుట్టుకువచ్చినట్టయింది.

గత డిసెంబర్ నెల చివర మా గ్రామ సముద్ర తీరంలో ప్రకృతి శిబిరం ఏర్పాటు చేశారు. అప్పటికి పరీక్షలు అయిపోవడంతో సముద్ర జలాలను తాకుతూ ఉండే చిన్న కొండను ఎక్కడానికి పరిగెత్తాను. ఆ కొండపైనుంచి చూస్తే అవతలి వైపు అఘనాశిని నది అందంగా కనిపిస్తుంది.

''అక్కడ ఏం జరుగుతున్నదో చూడు,'' అని అరిచాడు నా వెనగ్గా వస్తున్న నా క్లాస్‌మేట్ అరుణ్. మత్స్యకారులు కొందరు గుంపుగా గుమిగూడి ఉన్నారు. మేము ఆ గుంపులోకి చొచ్చుకుని వెళ్ళాం. అక్కడి దృశ్యం చూస్తూంటే నాకు ఒక్కక్షణం స్పృహతప్పి పడిపోయినంత పనయింది. అదో పెద్ద నల్లటి ఊదారంగు మాంసం ముద్ద. అదేదో జంతు శరీరంలోని భాగమై ఉంటుంది. మరి దాని మొదలెక్కడ? తుది ఎక్కడ?

''తిమింగిలం!'' అని ఎవరో చెప్పడం విన్నాను. అదేమిటో అర్థం కావడంతో నేను ధైర్యంగా మరింత లోపలికి వెళ్ళాను. బ్రహ్మాండమైన ఆ జలచరం ఇసుక మీద పరుచుకుని పడి ఉన్నది. దాని పక్కనే ఎంత మంది ఉన్నారో లెక్కించాను. ముప్ఫైఆరు మంది ఉన్నారు. దాన్ని బట్టి చూస్తే అది యాభై అడుగుల పొడవు ఉంటుంది. దాని వీపు నాకు కనిపించడం లేదు. నాకన్నా ఎత్తులో ఉందన్న మాట. అంతగా లోతు లేని నీళ్ళలో అది తీరంకేసి వచ్చి ఉంటుందనీ, ఉన్నట్టుండి బలమైన అలలు వీచడంతో అది ఒడ్డుకు విసిరివేయబడి ఉంటుందనీ పెద్దలు కొందరు చెప్పుకుంటూండగా విన్నాను. దాన్ని మళ్ళీ సముద్రంలోకి చేర్చడం ఎలా అన్నది ఇప్పుడు పెద్ద సమస్య. కొందరు యువకులు సముద్రం నుంచి బక్కెట్లతో



నీళ్ళు ముంచుకు వచ్చి తిమింగిలం వీపు మీద కుమ్మరిస్తున్నారు.

మా నేచర్ క్లబ్ టీచర్ లక్ష్మీ అక్క తిమింగిలం చర్మం ఎండకు పొడిబారకుండా అలా పోయమని వాళ్ళకు సలహా ఇచ్చింది.

అంతలో కొందరు తాళ్ళను తీసుకురావడంతో, వాటిని తిమింగిలానికి కట్టి జట్టులుగా చేరి దాన్ని నీళ్ళలోకి లాగడానికి ప్రయత్నించారు. పడవలను సముద్రంలోకీ, వెలుపలికీ లాగడం అలవాటు గల మా గ్రామస్థులు మంచి బలవంతులు. అయితే, తిమింగిలం ఎంత బరువు ఉంటుందో వాళ్ళకు తెలియదు. దాన్ని ఒక అంగుళం కూడా కదిలించలేక పోయారు. కేకలు వేస్తూ లాగడానికి చూశారు. అది అటూ ఇటూ కదల లేదు. తిమింగిలం ఏమీ జరగనట్టు దీనంగా చూస్తూ కదలామెదలక అలాగే ఉండిపోయింది.

ఇలాగే ఒకటిన్నర గంటసేపు గడిచిపోయింది. ఇక లాభం లేదు. అది చచ్చిపోక తప్పదనే నిర్ణయానికి వచ్చారు జనం.

కొంతసేపటికి ప్రభుత్వ మత్స్యశాఖ నుంచి ఇద్దరు వచ్చి తిమింగిలాన్ని కొలతలు తీసుకున్నారు. ఆఖరికి వారిలో ఒకాయన, ''నూనె లాంటి జిగట జారుడు పదార్థంతో దీని శరీరమంతా పూస్తే తప్ప దీన్ని సముద్రం లోకి చేర్చలేము,'' అన్నాడు.

అందుకు బండెడు నూనె కావాలి! అంత నూనె ఇప్పుడు ఉన్నపళాన ఎక్కడి నుంచి తీసుకురాగలం? ఈ అత్యవసర పరిస్థితిలో నా బుర్ర చురుగ్గా పనిచేయసాగింది. నేచర్ క్లబ్ కార్యకలాపాలలో పాల్గొంటూ ఉన్నప్పటికీ వాస్తవ ప్రపంచంలో ఎదురయ్యే సమస్యలను ఎదుర్కోలేక నిస్సహాయులుగా చూస్తూ ఉండి పోవలసిందేనా?

జారుడు పదార్థం కావాలి! అంత నూనె దొరకదు. ఇప్పుడు ఏం చెయ్యాలి? ఆలోచనలతో బుర్ర వేడెక్కింది. తలపట్టుకున్నాను! ఉన్నట్టుండి మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. ''లక్ష్మీ అక్కా, బాస్లే సొప్పు ఆకుల్ని మందార పూల రేకుల్ని కలిపి నూరినట్టయితే జిగట పదార్థం తయారవుతుంది. దాన్ని తిమింగిలం మీద పోసి లాగవచ్చుకదా? ఆ ఆకులు ప్రతి





పెరట్లో కావలసినంత దొరుకుతాయి!'' అని చెప్పాను.

అది వింత సలహానే! అయినా దాన్ని విన్న స్త్రీలు అక్కడి నుంచి వెనుదిరిగి ఇళ్ళకేసి వేగంగా వెళ్ళడం చూసి సంతోషించాను. మా గ్రామంలో 670 కుటుంబాలు ఉన్నాయి. నేనూ మా ఇంటి కేసి పరుగుతీశాను. మా అమ్మతో కలిసి సోప్పు ఆకులను కోసి రుబ్బాను. వాటికి లోలేసారా (అలోవీరా) ఆకులు కలిపి నూరాను. వాటిలోని రసం జిగురుగా ఉండడంతో పాటు గాయాలను ఆరుస్తుంది.

ఐదు బక్కెట్ల ఆకు పసరు తయారయింది. మా నాన్న సాయంతో దానిని ఎత్తుకుని తీరానికి బయలుదేరాం. మాతోపాటు అందరూ బక్కెట్లు, తగరపు డబ్బాల నిండా ఆకుపసరు తెచ్చారు. సైకిళ్ళ మీద, మోటారు బైకుల మీద కూడా తీసుకువచ్చారు. అది చూడడానికే ఎంతో ఉత్సాహం కలిగించింది. ఒకపనికోసం గ్రామస్థులందరూ కలిసికట్టుగా ఇలా బయలుదేరడం నేను అంతకు ముందెన్నడూ చూడలేదు. చీటికిమాటికి తగవులాడుకునేవాళ్ళ మధ్య ఇంతటి ఐకమత్యమా అని ఆశ్చర్యపోయాను.

ఒళ్ళంతా చెమటలు కక్కుతూండగా బక్కెట్లలో ఉన్న ఆకుపచ్చ పసరుతో తిమింగిలం వీపు మీద కుమ్మరించసాగారు. తిమింగిలం ఒళ్ళంతా పసరుతో నిండిపోయింది. ఆ తరవాత మత్స్యకారులు పనులు చేసేప్పుడు పాడే పాట పాడుతూ తిమింగిలాన్ని ముందుకూ, వెనక్కూ లాగసాగారు.

''ప్రకృతిమాతా! తిమింగిలాన్ని బతికించాలనే మా ప్రయత్నం ఫలించే విధంగా ఆశీర్వదించు,'' అని మనసులో ప్రార్థించుకున్నాను.

ఆ రోజు మా ఇళ్ళ నుంచి తీసుకువచ్చిన ఆకుపసరు మాయాజాలంలా పనిచేసిందంటే నమ్మండి.తిమింగిలం మెల్లగా జరగసాగింది. మెల్లగా నీళ్ళలోకి లోపలికి, లోలోపలికి వెళ్ళే కొద్దీ సులభంగా వేగంగా ముందుకు జరిగింది. పడవవాళ్ళు కష్టమని చూడకుండా పట్టుదలతో దాన్ని లోపలికి లాగి తాళ్ళను ముందున్న పడవవాళ్ళకు అందించారు. వాళ్ళు మెల్లమెల్లగా లాగి తిమింగిలాన్ని లోతైన నీళ్ళ మధ్యకులాక్కుపోయారు.

ఈదడానికి అనువుగా ఉన్న లోతైన నీళ్ళలోకి చేరగానే తిమింగిలంలో కదలిక వచ్చి, మెల్లగా ఈదడం మొదలుపెట్టింది. దాంతో పడవవాళ్ళు తాళ్ళను వదులు చేసి విప్పేశారు. తిమింగిలం ఈదుకుంటూ నీళ్ళను బలంగా వెదజల్లుతూ సముద్రంలోకి వెళ్ళిపోయింది. పడవలు తీరానికి వెనుదిరిగాయి. మేము తృప్తిగా నిట్టూర్చాము. ఆ మూగ ప్రాణిని కాపాడడంలో మా ప్రయత్నం ఫలించినందుకు మేమెంతగానో ఆనందించాము.

-సునీతా రావు

Non-stop fun @ chandamama.com!

# Non-stop fun @ chandamama.com!

Chandamama's Festive fun!

## What's your NEW YEAR RESOLUTION?

Post your NEW YEAR RESOLUTIONS at our site and print them for your future reference. Win surprise gifts for your resolutions- a motivation from our end for you to stick to your resolutions.

## Play our Cricket Quiz!

Know about your favourite players by answering simple questions. SMS CMCQ to 54646 and win fabulous prizes.

## Dear Chandamama

School issues? Friendship woes? Just plain confused about life and its problems?

Come to us with your questions and we will try to help you see light!

Pankaj. Z from California: Is komodo dragon a real dragon?

Karan J from Powai: I want to become a cartoonist. Please tell me how!

Nihan Varma from Nainital: I always yawn when I'm in a crowded place! Why is that?

To know the answers, browse CONNECT under CONTEMPORARY section at www.chandamama.com



## What's more...

Browse www.chandamama.com for hundreds of stories and comics for your reading pleasure...

Download cool games and applications at the Download center.

Want to become a Chandamama Author? Come online and submit your stories!

## స్విట్జర్లాండ్ జానపద కథ

# పాడే దేవదారు వృక్షం



స్విట్జర్లాండ్ వ్యాలైస్ ప్రాంతంలోని రెకింజన్ గ్రామంలో చెక్క శిల్పాలు చెక్కే సాధుస్వభావుడైన ఒక వడ్రంగి ఉండేవాడు. అతడు చెక్కిన దేవతా రూపాలు, మహనీయులు, భక్తుల కొయ్య విగ్రహాలతో ఆ ప్రాంతంలోని క్రైస్తవ ఆలయాలను అలంకరించేవారు.

ఒకనాటి సాయంకాలం ప్రార్థన కోసం రెకింజన్ చర్చ్ గంటలు మోగాయి. ఆ సమయంలో వీనుల విందుగా వింతైన కంఠస్వరంతో వడ్రంగికి ఒక పాట వినిపించింది. అతడు కిటికీ ద్వారా పాట వినిపిస్తూన్న దిక్కుకేసి చూశాడు. గ్రామాన్ని అనుకుని ఎత్తయిన కొండలపైన ఉన్న హోఫ్‌హ బాచ్ అడవి నుంచి పాట వినిపిస్తున్నది.

గుడిగంటలు మోగడం ఆగగానే ఆ పాట వినిపించడం కూడా ఆగిపోయింది. అంతా నా ఊహ కాదుకదా అనుకుంటూ వడ్రంగి, కొరముట్లను అలాగేపడేసి చర్చికి బయలుదేరాడు.

అయితే, మరునాడు కూడా చర్చ్ గంటలు మోగే సమయంలో ఆ పాట వినిపించింది. మూడో రోజు కూడా అలాగే వినిపించింది. నిజానికి ప్రతి రోజూ సాయంకాలం చర్చ్ గంటలు మోగేప్పుడల్లా ఆపాట వినబడుతూ, గంటలు మోగడం ఆగగానే ఆ పాట కూడా ఆగిపోతోంది. వడ్రంగి తను విన్న పాటను గురించి గ్రామస్థులకు చెప్పాడు. వాళ్ళల్లో కొందరు ఆ పాటను తాము కూడా విన్నట్టు చెప్పగానే వడ్రంగి హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు.

ఆ వింత సంగీతం ఎక్కడినుంచి వినిపిస్తున్నదో తెలుసుకుని తీరాలన్న నిర్ణయంతో వడ్రంగి ఒకనాడు హోఫ్‌బాచ్ అడవికేసి బయలుదేరాడు. చర్చ్ గంటలు మోగుతూండగా కొండ నెక్కి అక్కడి పెద్ద పెద్ద చెట్ల మధ్య కలయతిరగ సాగాడు.

ఆఖరికి అతడు వందయేళ్ళనాటి బ్రహ్మాండమైన దేవదారు వృక్షాన్ని సమీపించాడు. ఆ వృక్షం బోదెనుంచే సంగీతం వెలువడుతూండడం గమనించి విస్తుపోయాడు. ఆ సంగీతాన్ని మళ్ళీ మళ్ళీ విని ఆ విషయాన్ని నిర్ధారించుకున్న

## చందమామ క్విజ్ - 10 సమాధానాలు

1. రంజాన్; సౌదీ అరేబియాలోని మెక్కా 2. శ్రీ కృష్ణ జయంతిని సూచించే జన్మాష్టమి 3. తీజ్ 4. పార్సీలు; పటేటి

తరవాత, తను కనుగొన్న దాన్ని గ్రామస్థులకు తెలియజేయడానికి తిరుగుముఖం పట్టాడు.

అప్పటి నుంచి రోజూ పలువురు గ్రామస్థులు పాటలుపాడే దేవదారు వృక్షాన్ని చూడడానికి అడవికి వెళ్ళి రాసాగారు. వడ్రంగి కూడా అనేక సార్లు అడవికి వెళ్ళి ఆ చెట్టును చూసి, తాకి అమితానందం చెందేవాడు. ఎప్పుడూ ఆ వృక్షం గురించే ఆలోచించడంవల్ల అది కలలో సైతం అతణ్ణి వెంటాడేది. తను చెక్కిన విగ్రహాలన్నిటి లోకీ బ్రహ్మాండమైనదిగా ఒక విగ్రహాన్ని ఆ వృక్షం నుంచి మలచాలనే కోరిక ఆ వడ్రంగిలో బలంగా ఏర్పడింది.

తన ఆశను రెక్కింజన్ పారిష్‌ప్రీస్ట్‌కు విన్న వించడంతో, ఆయన అందుకు సంతోషంగా అంగీకరించాడు. వృక్షాన్ని పడగొట్టడానికి ఏర్పాట్లు జరిగాయి. అయినా, బ్రహ్మాండమైన ఆ వృక్షాన్ని పడగొట్టి, గుర్రాల సాయంతో దాన్ని కిందనున్న లోయలోకి లాక్కువస్తున్నప్పుడు కట్టెలు కొట్టేవాళ్ళ గుండెలు బరువెక్కాయి!

అద్భుతమైన శిల్పకారుడైన ఆ వడ్రంగి, వృక్షం బోదె నుంచి దుంగలాంటి పెద్ద ముక్కను తీసుకున్నాడు. అందులో 'వర్జిన్‌మేరీ' విగ్రహాన్ని మలచనున్నట్టూ, ఆ పనిని రాత్రి ప్రారంభిస్తు న్నట్టూ 'పారిష్ ప్రీస్ట్'కు చెప్పాడు. రాత్రింబ వళ్ళు అమితోత్సాహంతో నిద్రాహారాలు కూడా మరిచిపోయి, విగ్రహాన్ని మలచడంలో నిమగ్ను డయ్యాడు. పవిత్ర మేరీమాత విగ్రహం రూపం సంతరించుకోవడం చూడడానికి దూర ప్రాంతాల నుంచి జనం తండోపతండాలుగా రాసాగారు. దానిని చూసిన వారందరూ మరే కళాకారుడూ జీవకళ ఉట్టిపడే ఇంతటి అందమైన మేరీమాత విగ్రహాన్ని మలిచి ఉండలేదని కొనియాడారు.

మలచడం పూర్తి కాగానే వడ్రంగి దానిని చర్చికి అప్పగించాడు. ఆయన దానిని పీఠం మీద ప్రతిష్ఠించడాన్ని భక్తులు అబ్బురపాటుతో మౌనంగా తిలకించారు. మేరీమాత కొయ్య విగ్రహం హఠాత్తుగా నోరు తెరిచి చిరపరిచిత మైన అద్భుత దివ్య సంగీతాన్ని వినిపించింది. దేవదారు వృక్షం పాడడం అదే చివరి సారిగా మిగిలిపోయింది!



## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (36)

# ఉద్యమ ఆవిర్భావం



మేడమ్ బ్లావట్స్కీ స్థాపించిన దివ్యజ్ఞాన సమాజం (థియొసోఫికల్ సొసైటీ)లో చేరడానికి భారత దేశానికి తరలి వచ్చిన బ్రిటిష్ మహిళ డా. అనీ బెసెంట్. భారత దేశంలో స్థిరపడ్డాక ఆమె దేశ స్వాతంత్ర్యోద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. భారత జాతీయ కాంగ్రెస్ తొలి మహిళా అధ్యక్షులయ్యారు.

మన దేశంలో బాయ్‌స్కౌట్స్ ఉద్యమ ఆవిర్భావానికి కూడా ఆమెయే ప్రధాన కారణం. ఈ విషయంగా మొదట ఆమె విన్నవించినప్పుడు స్కౌట్ ఉద్యమ వ్యవస్థాపకులు లార్డ్ బ్యాడెన్ పోవెల్, ''భారత దేశంలో మన ఉద్యమ విస్తరణకు న్యాయం సమకూర్చడానికి చాలినంత మంది బ్రిటిష్ అధికారులు అక్కడ లేరు,'' అని ఉత్తరం ద్వారా సమాధానమిచ్చారు.

అది ఆమెను ఆశాభంగానికి గురిచేసినప్పటికీ, ఆ కార్యాన్ని సాధించి తీరాలనే పట్టుదలను కూడా పెంచింది. తను నివాస ముంటూన్న భారతదేశాన్ని మాతృభూమిగానూ, ప్రజలను తోబుట్టువులుగానూ భావించింది. సాయం వెలుపలి నుంచి అందనప్పుడు దానిని స్థానికంగానే పెంపొందించుకోవడానికి పూనుకున్నది. అందుకు మొదటి మెట్టుగా స్థానికులలో ఆత్మస్థయిర్యాన్నీ, ఆత్మగౌరవాన్నీ కలిగించాలి. గత చరిత్ర, సంస్కృతీ సంప్రదాయాల పట్ల గౌరవాభిమానాలు పెంపొందించాలి. అప్పుడే స్వాతంత్ర్యం సిద్ధించినప్పుడు దానిని ఆత్మవిశ్వాసంతో, సమర్థతో వినియోగించుకునే శక్తిసామర్థ్యాలు లభ్యమవుతాయి.

యువతలో క్రమశిక్షణ, ఆత్మవిశ్వాసం పాదుకొల్పడానికి స్కౌట్ ఉద్యమం ఎంతగానో దోహద పడగలదని అనీ బెసెంట్ ప్రగాఢంగా విశ్వసించారు. 'నిర్మల మనస్కు' లైన యువకులలో ఆదర్శభావాలను కలిగించడం సులభమని ఆమె భావించారు. అందుకు అనుగుణంగా ఇండియన్ బాయ్ స్కౌట్స్ అసోసియేషన్ రూపకల్పనకు ఏర్పాట్లు మొదలు పెట్టారు. పిల్లలలో ఆత్మవిశ్వాసాన్ని, స్వావలంబనను పెంపొందించడానికి అనువైన శిక్షణను అందించడానికి కూడా నిర్ణయించారు.

స్కౌట్ గ్రూపులు ప్రారంభించడానికి అనేక పాఠశాలలు ముందుకు వచ్చాయి. అలాంటి పాఠశాలలోని ఉపాధ్యాయులలో ఒకరిని ఎంపిక చేసి స్కౌట్ మాస్టర్ శిక్షణనిస్తారు. ఆ కాలంలో బడి పిల్లలకు యూనిఫారాలు ఉండేవి కావు. శారీరక వ్యాయామానికంటూ ప్రత్యేకంగా డ్రిల్లు పిరియడ్లు లేవు.

బాయ్ స్కౌట్స్‌లో చేర్చుకున్న వారికి షూలతో సహా యూనిఫారాలు అందజేశారు. హ్యాట్‌కు బదులు భారతీయ విద్యార్థులకు చిన్న తల పాగా బావుంటుందని బెసెంట్ భావించారు. ఉత్తేజ పూరిత సంగీతంతో తమ సొంత భాషలో దేశభక్తిగీతాలను ఆలపించాలని కూడా నిర్ణయించారు. అలాంటి పాటలు పాడడం పసిహృదయాలకు స్ఫూర్తిని కలిగిస్తాయని ఆమె భావించారు.

శిక్షణ క్రమబద్ధంగా జరిగేది. పరిశుభ్రత, వినయ విధేయతలు, స్నేహం, దయ, కరుణ పాటించాలని ఆచరణలో చూపేవారు.

ఆ సమయంలో ఒకనాడు లార్డ్ బ్యాడెన్ పొవెల్ భారత దేశానికి విచ్చేస్తున్నట్టు తెలిసి అనీ బెసెంట్ ఆశ్చర్యపడ్డారు. ఆయన ఇండియన్ బాయ్ స్కౌట్స్‌ను చూసి తృప్తి చెందగలడా? అనుమతి కోసం మొదట విన్నవించినప్పుడు అంగీకరించకపోవడం పొరబాటని గ్రహించగలడా? అన్న ఆలోచనలతో ఆమెలో ఒక విధమైన తపన ఆరంభమయింది.

మార్చ్‌పాస్ట్ వందన స్వీకారానికి లార్డ్ బ్యాడెన్ పొవెల్ వస్తున్నట్టు నిర్ణయించబడింది. ఆయన రావడానికి అంగీకరించాడేగాని ఇక్కడివారి నుంచి గొప్పగా ఆశించలేదు. అయితే, నిర్దుష్టమైన బాయ్‌స్కౌట్స్ ప్రదర్శనను చూసి పులకించిపోయాడు. అద్భుతమైన బ్యాండ్; నిర్ణీతకొలతలతో నియమబద్ధమైన అడుగులు; స్ఫూర్తిని రేకెత్తించే గీతాలాపన వీటిని చూసి ఉద్యమ స్థాపకుడి మనసు ఉప్పొంగింది.

ఆయన అనీ బెసెంట్‌కేసి తిరిగి, ''మీరు సమ్మతించినట్టయితే, బాయ్‌స్కౌట్స్ అసోసియేషన్‌ను బ్రిటిష్ బాయ్ స్కౌట్స్ ఉద్యమంతో అనుసంధానం చేయడానికి నిర్ణయించాను,'' అన్నాడు.



అంతే కాదు. ఆయన అప్పటికప్పుడే డా. అనీబెసెంట్‌ను 'ఆనరరీ స్కౌట్ కమిషనర్'గా నియమిస్తున్నట్టు కూడా ప్రకటించాడు. ఆమెకు ఆ పదవి ప్రధానం కాదు. అయితే భారత బాయ్‌స్కౌట్స్, ప్రపంచంలోని మరేదేశం స్కౌట్స్ కన్నా తీసిపోనిది, దీటైనది అన్న తన విశ్వాసానికి గుర్తింపు రావడం ఆమె గొప్ప గౌరవంగా భావించారు. -(కె.ఆర్)

## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు - 16

# దీపావళిరోజు విడుదల

దీపావళి అనగానే మామూలుగా దీపాలంకరణలు, బాణాసంచాలు జ్ఞాపకం వస్తాయి. అయితే 1942వ సం. బీహారు హజారీ బాగ్ జైలులోని రాజకీయ ఖైదీలు ఆరోజు స్వాతంత్ర్యం కోసం ఆలోచించసాగారు. వాళ్ళ నాయకుడు జయప్రకాష్ నారాయణ్. 1942 ఆగస్ట్ 9వ తేదీ గాంధీజీ 'క్విట్ ఇండియా ఉద్యమం' ప్రారంభించిన వెంటనే బ్రిటిష్ ప్రభుత్వం జాతీయ నాయకులందరినీ ఖైదు చేసి పలు కారాగారాలకు తరలించింది.

జయప్రకాష్ నారాయణ్‌ను కొండ ప్రాంతాలలోని హజారీ బాగ్ జైలులో బంధించారు. జైలు చుట్టూ దట్టమైన అడవులు. ఎత్తయిన గోడల మధ్య నిర్మించిన ఈ జైలును భయంకరులైన నేరగాళ్ళను, అలాంటి అపాయకరమైనవాళ్ళని భావించబడ్డ జాతీయ నాయకులను బంధించడానికి ఉపయోగించేవారు.

ఒకనాటి సాయం సంధ్యవేళ దీర్ఘాలోచనతో జైలు గదిలో కూర్చున్న జయప్రకాష్ నారాయణ్ చూపులు చిన్న కిటికీ గుండా ఆకాశంలో గూళ్ళకు తిరిగి వెళుతూన్న పక్షుల మీదపడ్డాయి. ఆహా! అవి ఎంత స్వతంత్రంగా ఎగర గలుగుతున్నాయి? పక్షులకు లాగా మనకూ రెక్కలుంటే జైలు నుంచి ఎగిరి వెళ్ళిపోయేవాళ్ళం కదా! అనే ఆలోచన ఆయన మనసులో మెరుపులా తోచింది. అది అసాధ్యమన్న వాస్తవాన్ని గుర్తించడంతో ఊరుకున్నాడు గాని, జైలు నుంచి ఎలాగైనా బయట పడాలన్న నిష్కపటిక



లాంటి కోరిక మాత్రం ఆ క్షణం నుంచి జ్వాలలా వెలగసాగింది. తనలోని కోరికను సహచరులకు చెప్పాడు. అది అసాధ్యమని కొందరు కొట్టి పారేశారు. మరి కొందరు దాని సాధ్యాసాధ్యాల గురించి చర్చించుకోవడం చూసి ఆయన ఆనందించాడు. అంతకు పూర్వం జైళ్ళ నుంచి తప్పించుకున్న ఖైదీలు, నేరగాళ్ళు, విప్లవకారుల గురించి మాట్లాడుకున్నారు. జైలు అధికారుల కళ్ళల్లో కారం చల్లి వారు అనుసరించిన విజయవంతమైన మార్గాల గురంచి పరిశీలించారు. దక్షిణాది స్వాతంత్ర్య యోధులు చేపట్టిన పద్ధతులను అధ్యయనం చేశారు. జాగ్రత్తగా పథకం రూపొందించినట్టయితే జైలు నుంచి తప్పించుకోవడం అసాధ్యం కాదన్న నిర్ణయానికి వచ్చారు.

జయప్రకాష్ కామ్రేడ్లలో ఆయనలాగే బీహారుకు చెందిన ఎ.పి. సిన్హా చాలా ముఖ్యుడు. అంతా విన్న అతడు, ''జేపీ, నీతో కలిసి తప్పించుకోలేనుగాని, నువ్వు తప్పించుకుంటున్నప్పుడు అధికారుల కంటబడకుండా దారిని అడ్డుకోగలను. ప్రజలను ఉత్సాహభరితుల్ని చేసి స్ఫూర్తిని కలిగించి స్వాతంత్ర్య ఉద్యమాన్ని ముందుకు నడిపించే అద్భుతశక్తి నీకున్నది. నువ్వు గొప్ప జాతీయ నాయకుడివి!'' అన్నాడు గంభీరంగా.

ఆ తరవాత జయప్రకాష్‌తో కలిసి ఎవరెవరు తప్పించుకోవాలి అన్న విషయం నిర్ణయించబడింది. ఎప్పుడు, ఎలా తప్పించుకోవాలి అన్న పథకం పకట్బందీగా చర్చించి రూపొందించబడింది.

నిర్ణయించబడిన నవంబర్ 8వ తేదీ తెల్లవారింది. ఆరోజు దీపావళి పండుగ జరుపుకోవడంలో అందరూ హడావుడిగా ఉన్నారు. జెపీ అనుచరులు తప్పించుకునే పథకాన్ని ప్రశాంతంగా అమలు పరిచారు. పగటి పూట అధికారులతో సహా అందరికీ మిఠాయిలు పంచారు. సాయంకాలం కథలు చెప్పడంలో అందెవేసిన చెయ్యి అయిన ఎ.పి. సిన్హా కథాకాలక్షేపానికి ఏర్పాటుచేశారు. అందుకు జైలు అధికారులను ఆహ్వానించారు.

సాయంకాలమయింది. సిన్హా కథాకాలక్షేపం ప్రారంభించాడు. కాపలా భటుల, అధికారుల దృష్టి లోపల జరుగుతూన్న అసలు కథ మీద పడకుండా ఖైదీలు సిన్హా చెప్పే కథ వింటూ నవ్వులతో, కేకలతో నానా హంగామా చేయసాగారు. సిన్హా ఉత్సాహ భరితంగా వినోదాత్మకమైన కథలు చెప్పసాగాడు.

లోపలికి చేరిన మిత్రులు తాము కప్పుకునే దుప్పట్లను, పంచలనూ పెనవేసి. ఒకదానితో ఒకటి ముడివేశారు. పొడవాటి తాడు తయారయింది. తక్కిన బట్టలను వీపులకు మూటలుగా కట్టుకున్నారు. ఎత్తయిన ప్రహరీ గోడల

**చందమామ క్విజ్ -10 (నవంబర్ '08)**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు.
అందువల్ల బహుమతి ఇవ్వలేకపోతున్నాం.

కేసి మెల్లగా నడిచారు. వారిలో ఒకడు గోడ మీదుగా ఉన్న దృఢమైన ఇనుప మేకుకు తగులుకునే విధంగా తాడు ముడివేసి నేర్పుగా విసిరాడు. దాన్ని ఒకసారి బలంగా లాగి చూసి దృఢంగా ఉందని గ్రహించి, ''నేను మొదట గోడ ఎక్కి అవతలికి దూకుతాను,'' అంటూ జయప్రకాష్ నారాయణ్, చకచకా దాని సాయంతో గోడ మీదికి ఎగబ్రాకి గోడ మీద నిలబడి క్షణం పరిశీలించి చూసి అవలికి దూకే శాడు. కింద పచ్చటి గడ్డి, ఎండు టాకులు ఒత్తుగా ఉండడంతో ఎలాంటి గాయమూ తగల లేదు. మిగిలిన నలుగురూ ఆయన్ను అనుసరించారు.

ఐదుగురు మిత్రులూ క్షేమంగా బయట పడ్డాక ఒకరినొకరు కౌగిలించుకున్నారు. ఆ తరవాత అమావాస్య చీకట్లో చెట్ల చాటుగుండా రాళ్ళు రప్పల మీదుగా, చిత్తడి నేలపై తెల్లవారే దాకా నడిచారు. తెల్లవారుతూండగా తమ తలల మీదుగా ఉన్నట్టుండి విమానం ఎగిరే శబ్దం రావడంతో, చెట్ల చాటున పొదరిళ్ళలో దాక్కున్నారు. కొంత సేపటికి విమానం వెళ్ళి పోయి, శబ్దం దూరం కావడంతో మళ్ళీ నడ వడం ప్రారంభించారు.

మరికొంత దూరం వెళ్ళే సరికి బాటలో రెండు ఎడ్ల బండ్లు ఎదురు కావడంతో ఆపమని అడి గారు. వాళ్ళు ఖైదీబట్టలతో ఉండడంతో మొదట నేరస్థులుగా అనుమానించిన బండి తోలేవాళ్ళు, వాళ్ళను పరిశీలనగా చూసి మాటల ద్వారా రాజకీయ ఖైదీలని గ్రహించారు. వాళ్ళలో ఒకడు జయప్రకాష్‌ను గుర్తుపట్టి ఆప్యాయంగా బండిలోకి ఎక్కించుకున్నాడు.

బండ్లు పక్క గ్రామం చేరగానే, గ్రామస్థులు వారికి ఆహారం పెట్టి మంచి బట్టలు ఇచ్చారు. ఆ తరవాత వాళ్ళు తలపాగాలు చుట్టుకుని, భుజాలపై గొడ్డళ్ళను పట్టుకుని స్థానికరైతుల్లా పయనం కొనసాగించారు.

అదే సమయంలో తప్పించుకున్న వాళ్ళ కోసం జైలు అధికారులు చుట్టు పక్కల వెది కారు గాని, పట్టుకోలేకపోయారు. జయ ప్రకాష్, ఆయన కామ్రేడ్లు మరో ఐదేళ్ళు స్వతం త్రంగా ప్రజల మధ్య ఉన్నారు.



ఈ ఐదేళ్ళకాలం జయప్రకాష్ గయకూ, బెనారస్‌కూ మధ్య గడిపాడు. ఆ కాలంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని పడదోయడానికి అజ్ఞాత ఉద్య మాన్ని నడిపాడు. దృఢచిత్తం, ప్రశాంత ధైర్యం, అపారమైన మాతృదేశ భక్తి కలిగిన జయప్రకాష్ నారాయణ్ 'లోక్ నాయక్'గా పేరుగాంచాడు. అయినా ఆ మహానుభావుడు తనెప్పుడూ ఒక ప్రజా సేవకుడిగానే భావించాడు. -(ఆర్.కె)

# క్రికెట్ ఎవరెస్ట్ మీద సచిన్




ప్రపంచ ప్రసిద్ధ మల్లయుద్ధ వీరుడు మహ్మద్ అలీ ఎలాంటి సంకోచం లేకుండా, ''నేను అందరి కన్నా గొప్పవాణ్ణి!'' అని చాటుకున్నాడు. సచిన్ క్రికెట్‌లో అంతటి గొప్పవాడే అయినప్పటికీ వినయం కారణంగా అలా ఎన్నడూ చెప్పుకోలేదు. అక్టోబర్ 17వ తేదీ మొహాలీలో ఇండియా, ఆస్ట్రేలియాతో సెకండ్ మ్యాచ్ ఆడినప్పుడు ఆయన ప్రపంచ క్రికెట్‌లో గొప్పవాడయ్యాడు. వెస్ట్ ఇండియన్ బ్రియాన్ లారా ఇన్నింగ్స్ 11,953 టెస్ట్ పరుగులను అధిగమించి సచిన్ ప్రపంచ రికార్డు సృష్టించగలడని ఎదురు చూశారు. ఆ రికార్డును అధిగమించడానికి సచిన్ బ్యాటింగ్ ప్రారంభించినప్పుడు 15 పరుగులే కావలసి వచ్చింది. టీ బ్రేక్ కల్లా 13 పరుగులు చేశాడు. ఆయన పీటర్ సిడిల్స్ ఫస్ట్‌డెలివరీని ఎదుర్కొన్నాడు. రెండు పరుగులు పూర్తి చేసి దానిని మూడు చేయడానికి ఇంకా కొనసాగించాడు. ఇప్పుడు రెండు టెస్టులలోనూ (39) ఒడిఐలలోనూ (42) ఎక్కువ సెంచురీలు స్కోర్ చేసిన రికార్డు సాధించాడు. ఒడిఐలలో 16,361 పరుగుల రికార్డు సృష్టించాడు. ఆయన 16వ యేట తొలి టెస్ట్ ఆడాడు. 'లిటిల్ స్టార్' అని అభిమానంతో పిలువబడ్డ ముంబయిలో జన్మించిన సచిన్ మన దేశం టీమ్‌కు 25 సార్లు కేప్టన్‌గా ఉన్నాడు. ఆయన అత్యద్భుత విజయాన్ని, పట్టుదలకు నిరంతర కృషికి లభించిన కానుకగా చెబుతారు. ఒన్‌డేలలో 100 వికెట్స్, 100 క్యాచ్‌స్ సాధించిన ప్రత్యేకత కూడా ఆయనకు ఉన్నది. సుప్రసిద్ధ వ్యాఖ్యాత హర్షాభోగ్లే మాటల్లో చెప్పాలంటే, ''సచిన్ క్రికెట్ ఎవరెస్ట్ శిఖరం మీద నిలబడి ఉన్నాడు!''

గమనిక : నాగ్‌పూర్‌లో నవబంర్ 6వ తేదీ జరిగిన మ్యాచ్‌లో సచిన్ తన 40వ టెస్ట్ వంద సాధించాడు.




# చంద్రయాన్ ప్రయోగం

మనదేశం సొంత సాంకేతిక పరిజ్ఞానంతో చంద్రయాన్-1 ఉపగ్రహాన్ని చంద్రుడికి పంపి సరికొత్త చరిత్ర సృష్టించింది. చంద్రుడి గురించి మరింత సమాచారాన్ని సేకరించడానికి ఈ ఉపగ్రహ ప్రయోగం ఉద్దేశించబడింది.

11 పే లోడ్స్ తీసుకెళ్ళిన 1,380కి.గ్రా. బరువైన చంద్రయాన్-1 అక్టోబర్ 22వ తేదీ పిఎస్ఎల్వి-సి11 బ్లాస్ట్ చేసిన 18.2 నిమిషాల తరవాత 'ట్రాన్స్‌ఫర్ ఆర్బిట్'లోకి రిలీజ్ చేయబడింది. ఇది మరో రెండేళ్ళపాటు చంద్రుడికి సంబంధించిన విశేషాలను సేకరించి పంపుతుంది.

వివిధ దశల ద్వారా ఈ 'స్పేస్‌క్రాఫ్ట్' తన 4,00,000 కి.మీ. ప్రయాణాన్ని సాగించింది. నవంబర్ 12వ తేదీ చంద్రుడికి 100 కి.మీ. దూరంలో ఉన్న ఫైనల్ రెస్టింగ్ ఆర్బిట్ (కక్ష్య)ను చేరుకున్నది.

# తొలి నవలకు ప్రతిష్ఠాత్మక సాహితీ పురస్కారం!

ఉత్తమ కథారచనకు యేటా మాన్ బూకర్ అవార్డు ప్రదానం చేస్తారు. అరవింద్ అడిగా అనే భారతీయ రచయిత తన తొలి నవల 'ది వైట్ టైగర్'కు ఈయేటి ప్రతిష్ఠాత్మకమైన మాన్ బూకర్ అవార్డును అందుకుంటున్నారు. ఆయన వయసు 34 యేళ్ళే కావడం విశేషం. బ్రిటిన్, ఐర్లండ్‌లతో సహా కామన్వెల్త్ దేశాలలో వెలువడ్డ ఉత్తమ ఆంగ్ల నవలకు 50,000 పౌండ్లు బహుమతిగా ఇస్తారు.

అరవింద్ అడిగా-మద్రాసు (ఇప్పటి చెన్నయ్) నగరంలో 1974లో జన్మించారు. పాఠశాల విద్యను మనదేశంలోనూ, ఆస్ట్రేలియాలోనూ ప్రారంభించిన అడిగా న్యూయార్క్‌లోని కొలంబియా విశ్వవిద్యాలయంలోను, ఆక్స్‌ఫర్డ్‌లోని మాగ్దాలెన్ కాలేజీలోనూ ఆంగ్ల సాహిత్యం చదివారు. ఆయన రచనలు ది ఫైనాన్సియల్ టైమ్స్, ఇండిపెండెంట్ మొదలైన బ్రిటిష్ పత్రికలలో వెలువడ్డాయి. అడిగాకు ముందు మనదేశానికి చెందిన వి.ఎస్. నాయ్‌పాల్, సల్మాన్ రుష్దీ, అరుంధతీ రాయ్, కిరణ్ దేశాయ్ మాన్ బూకర్ అవార్డు అందుకున్నారు.





# దేవధర్మం

చాలాకాలం క్రితం కాశీరాజుకు పట్టపు రాణియందు ఇద్దరు కొడుకులు కలిగారు. రాజు వారికి మహింసాసుడనీ, చంద్రకుమారుడనీ పేర్లు పెట్టాడు. మహింసాసుడే బోధిసత్త్వుడు. చంద్రకుమారుడు పసివాడుగా ఉండగానే తల్లి తీరని వ్యాధి సోకి హఠాత్తుగా చనిపోయింది.

అప్పుడు రాజు మరొక భార్యను పెళ్ళాడి, ఆమెను పట్టపురాణిని చేశాడు. ఆమె రాజుకు ప్రేమపాత్రురాలుగానూ, అనుకూలవతిగానూ ఉంటూ, కాలక్రమాన తాను కూడా ఒక అందమైన పిల్లవాణ్ణి కన్నది. వాడికి సూర్యకుమారుడని పేరు పెట్టారు. రాజు ఒకనాడు ఈ పుత్రుణ్ణి చూసి ఎంతగానో సంతోషించి పట్టపురాణితో, ''నీ కొడుక్కు ఏదైనా వరం ఇస్తాను కోరుకో,'' అన్నాడు.

''మీ అభిమానానికి చాలా కృతజ్ఞతలు. అయితే, ఇప్పుడు కాదు, నాకు కోరాలనిపించినప్పుడు వరం అడిగి పుచ్చుకుంటాను,'' అన్నది పట్టపురాణి.

కొంత కాలానికి సూర్యకుమారుడు యుక్తవయస్కుడయ్యాడు. అప్పుడు పట్టపురాణి రాజుతో, ''నాకు కొడుకు పుట్టినప్పుడు వరం ఇస్తానన్నారు. జ్ఞాపకం ఉన్నది కదా? ఇప్పుడా మాట చెల్లించి, నా కొడుక్కు రాజ్యం ఇయ్యండి,'' అన్నది.

''అగ్నిజ్వాలల లాగా ప్రకాశించే పెద్ద కొడుకులు ఇద్దరుండగా నీ కొడుక్కు రాజ్యం ఇవ్వటం ఏ ధర్మమూ అంగీకరించదు. అందువల్ల అది సాధ్యం కాదు,'' అన్నాడు రాజు.

రాణి ఆగ్రహం చెందింది కాని, అప్పటికేమీ మాట్లాడకుండా మౌనం వహించింది.

ఆమె తన పెద్ద కొడుకులకు హాని చేయవచ్చునని రాజుకు అనుమానం కలిగింది. ఆయన ఒకనాడు మహింసాసుణ్ణీ, చంద్రకుమారుణ్ణీ చేర పిలిచి, ''అబ్బాయిలూ,

జాతక కథ



నేను సూర్యకుమారుడు పుట్టిన సమయంలో మీ పినతల్లికి ఒక వరం ఇస్తానన్నాను. ఆమె ఇప్పుడు సూర్యకుమారుడికి రాజ్యం ఇవ్వమని కోరుతున్నది. నేను అందుకు అంగీకరించలేదు. అయితే దురాశ ప్రళయాంతకమైనది. అది రాజ కుటుంబంలో మరింత హాని కలిగిస్తుంది. ఆమె మీకు ఏదన్నా కీడు చేయవచ్చు. అందుచేత మీరు వెంటనే అరణ్యాలకు వెళ్ళి, నేను కన్ను మూశాక తిరిగి వచ్చి, ఈ రాజ్యం ఏలుకోండి,'' అని చెప్పాడు.

ఇదేమీ సూర్యకుమారుడు ఎరగడు. ఒకనాడు తన అన్నలు చెప్పాపెట్టాకుండా రాజభవనం దిగి ఎక్కడికో ప్రయాణం అవుతూ ఉండటం చూసి, ఆశ్చర్యపోయాడు. అన్నలతో పాటు బయలుదేరాడు.

ముగ్గురు అన్నదమ్ములూ కొన్నాళ్ళకు హిమాలయాల మీదికి వెళ్ళారు. బోధిసత్వుడు దారికి ఎడంగా ఉన్న ఒక చెట్టు కింద కూర్చుని సూర్యకుమారుడితో, ''తమ్ముడూ, ఆ కనిపించే కొలనుకు వెళ్ళి, స్నానం చేసి, దాహం తీర్చుకుని, మా ఇద్దరికీ తాగటానికి తామరాకులతో నీరు పట్టుకురా,'' అన్నాడు.

ఆ కొలను ఒక జలరాక్షసుడైన యక్షుడిది. కుబేరుడు దాన్ని ఆ జలరాక్షసుడి కిచ్చి, దేవధర్మం ఎరిగిన వారిని విడిచి పుచ్చమనీ, అది తెలియనివాళ్ళు ఎవరైనా కొలనులో దిగితే వారిని భక్షించమనీ, కొలనులోకి దిగని వారి జోలికి పోవద్దనీ చెప్పాడు.

అది మొదలు ఆ యక్షుడు కొలనులో దిగిన ప్రతి మనిషినీ, ''దేవధర్మం ఏమిటి?'' అని అడిగి, చెప్పలేని వారిని భక్షిస్తూ వస్తున్నాడు. అందుచేత, సూర్యకుమారుడు కొలనులోకి దిగగానే ఆ యక్షుడు అతణ్ణి అడ్డుకుని, ''నీకు దేవధర్మం తెలుసునా?'' అని అడిగాడు.

''తెలుసు; దేవధర్మం అంటే ఆకాశంలో వెలుగుతున్న సూర్యచంద్రులు,'' అన్నాడు సూర్యకుమారుడు.

''నీకు దేవధర్మం తెలియదు,'' అని యక్షుడు సూర్యకుమారుణ్ణి కొలను లోపల ఉన్న తన నివాసానికి తీసుకుపోయి అక్కడ ఉంచాడు.

సూర్యకుమారుడు ఎంతకూ రాకపోవటం చూసి బోధిసత్వుడు చంద్రకుమారుణ్ణి కొలనుకు పంపాడు.

యక్షుడు అతణ్ణి కూడా పట్టుకుని, ''దేవ ధర్మం ఏమిటి?'' అని అడిగాడు.

''దేవధర్మం అంటే నాలుగు దిశలూ,'' అన్నాడు చంద్రకుమారుడు.

''నీకు దేవధర్మం తెలియదు,'' అని చెప్పి, యక్షుడు అతణ్ణి కూడా తీసుకుపోయి తన నివాసంలో ఉంచాడు.

చంద్రకుమారుడు కూడా ఎంతకూ రాక పోయేసరికి బోధిసత్వుడికి అనుమానం కలిగింది. ఏదో విపత్తు సంభవించి ఉంటుందను కుని, తానే స్వయంగా బయలుదేరి కొలను దగ్గరికి వచ్చాడు. అక్కడ ఇద్దరు మనుషులు కొలనులోకి దిగిన అడుగుజాడలు కనిపించాయి గాని, అందులో నుంచి బయటికి వచ్చిన జాడ కనిపించలేదు. ''ఇందులో ఎవరో రాక్షసుడున్నాడు కాబోలు,'' అనుకుని బోధి సత్వుడు చుట్టుపక్కలు పరిశీలించి చూసి కత్తి దూసి చేత పట్టుకుని, యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డాడు.

అతను నీటిలోకి దిగక పోవటం చూసి జలరాక్షసుడైన యక్షుడు ఆటవికుడి రూపంలో అతడి ముందుకు వచ్చి, ''మహాశయా, నీటిలోకి దిగి, హాయిగా స్నానం చేసి, దప్పిక తీర్చుకోక, ఒడ్డున ఎందుకిలా అనుమానంతో నిలబడి ఉన్నావు?'' అని అడిగాడు.

ఈ కొలనుకు అధిపతి అయిన యక్ష రాక్షసుడు ఈ మనిషే అయి ఉంటాడని బోధిసత్వుడికి అనుమానం కలిగింది. ''నా తమ్ములను పట్టుకుపోయినది నువ్వేనా?'' అని ఆయన అడిగాడు.



''అవును, వాళ్ళను పట్టుకుపోయింది, నేనే!'' అన్నాడు యక్షుడు.

''ఎందుకు అలా చేశావు?'' అని బోధి సత్వుడు అడిగాడు.

''ఈ కొలనులో దిగేవారు నాకు అధీను లవుతారు,'' అన్నాడు యక్షుడు.

''కొలనులో దిగిన ప్రతివాడూ నీకు లోబడ వలసిందేనా?'' అని అడిగాడు బోధిసత్వుడు.

''దేవధర్మం తెలిసిన వాళ్ళు తప్ప అందరూ నా అధీనంలో ఉంటారు,'' అన్నాడు యక్షుడు.

''నీకు దేవధర్మం కావాలంటే నేను చెప్ప గలను,'' అన్నాడు బోధిసత్వుడు.

''అయితే చెప్పు!'' అన్నాడు యక్షుడు ఉత్సాహంగా.

''అభిమానమూ, నిందాభయమూ, శుభ కర్మమూ, సత్యమూ, శాంతమూ గల సత్పు

రుషుడి ధర్మమే దేవధర్మం,'' అన్నాడు బోధిసత్వుడు.

యక్షుడు ఈ మాటకు ఎంతో తృప్తిపడి, బోధిసత్వుడికి సత్కారాలు చేసి, ''నాకు నీపైన అనుగ్రహం కలిగింది. నీ తమ్ములలో ఒకణ్ణి నీకు తిరిగి ఇస్తాను. ఎవర్ని తీసుకు రమ్మన్నావు?'' అన్నాడు.

''నా చిన్న తమ్ముణ్ణి తీసుకురా,'' అన్నాడు బోధిసత్వుడు.

''పండితుడా, నీకు దేవధర్మం తెలుసునే గాని, దాన్ని అమలుపరచటం తెలియదు,'' అన్నాడు యక్షుడు.

''అలాగా! ఆ మాట ఎలా చెప్పగలిగావు?'' అని బోధిసత్వుడు అడిగాడు చిన్నగా నవ్వుతూ.

''నీ తమ్ములలో పెద్దవాణ్ణి వదిలి చిన్నవాణ్ణి అడగటంలో పెద్దవాడికి గౌరవం లేకుండా చేస్తున్నావు,'' అన్నాడు యక్షుడు.

''యక్షుడా, నేను దేవధర్మాన్ని ఆచరించే వాణ్ణి కనకనే అలా కోరాను. నా చిన్న తమ్ముడి కారణంగానే నేను అరణ్యాలకు రావటం జరిగింది. అతడి తల్లి మా తండ్రిని రాజ్యం అడిగింది. మా క్షేమం కోరి మా తండ్రి మమ్మల్ని వనానికి పంపాడు. ఇతను లేకుండా నేను మా రాజ్యానికి తిరిగిపోయి, వాణ్ణి ఎవరో యక్షుడు మింగేశాడంటే భావ్య మౌతుందా? లోకం నన్ను నిందించదా? పైగా, నాపెద్ద తమ్ముడూ నేనూ ఒకే తల్లి బిడ్డలం. చిన్న తమ్ముడు పినతల్లి కొడుకు. అందువల్ల అతణ్ణి సజీవుణ్ణి చేయడమే అన్ని విధాలా ధర్మం,'' అన్నాడు బోధిసత్వుడు.

''నీకు దేవధర్మం తెలియటమే కాదు, అనుభవం కూడాను,'' అని యక్షుడు చంద్రకుమారుణ్ణీ, సూర్యకుమారుణ్ణీ తీసుకు వచ్చి బోధిసత్వుడికి ఇచ్చాడు.

కొంతకాలం గడిచాక ముసలిరాజు చనిపోయినట్టు తెలిసింది. బోధిసత్వుడు తన తమ్ములిద్దరితోనూ తన దేశానికి తిరిగి వెళ్ళి, రాజ్యాభిషేకం చేసుకుని, తన తమ్ములైన చంద్రకుమారుణ్ణి యువరాజుగానూ, సూర్యకుమారుణ్ణి సేనాపతిగానూ నియమించి, రాజ్యపాలన చేశాడు.





# రామాయణం

హనుమంతుడు చెప్పినదంతా విని రాముడు పరమసంతోషం చెంది, ''ఆహా, ఈ హనుమంతుడు చేసిన పని మరెవరు చెయ్యగలరు? సముద్రాన్ని దాటటం గరుత్మంతుడికీ, వాయుదేవుడికీ, ఈ హనుమంతుడికీ తప్ప మరెవరికీ సాధ్యమయ్యే పని కాదు. అంతతో పోక ఈ హనుమంతుడు దేవతలకు సైతం ప్రవేశించరాని లంకను ప్రవేశించాడు! అక్కడ అశోకవన భంగమూ, రాక్షస సంహారమూ, లంకా దహనమూ మొదలైన అద్భుత కార్యాలు చేశాడు! సీతనూ, నన్నూ ఈ హనుమంతుడు కాపాడినవాడైనాడు. ఇతనికి ఏమి ఇచ్చినా తీరదు. అన్నిటికీ బదులుగా ఆలింగనం చేసుకుంటాను,'' అంటూ హనుమంతుణ్ణి కౌగలించుకున్నాడు.

తరవాత రాముడు సుగ్రీవుడితో, ''సీతను వెతకటంలో కృతకృత్యులమయ్యామే గాని ఆ సముద్రాన్ని తలుచుకుంటే నా మనసు కుంగిపోతున్నది. దాని దక్షిణ తీరానికి ఎలా చేరుకునేట్టు?'' అన్నాడు విచారంతో.

అప్పుడు సుగ్రీవుడు రాముణ్ణి చూసి, ''ఎందుకు విచారం? అది కార్యహాని హేతువు. సముద్రానికి సేతువు కట్టి లంకలో అడుగు పెట్టే ఉపాయం ఆలోచించామంటే ఆ రావణుడు చచ్చిన వాడి కిందనే లెక్క. సముద్రానికి సేతువు కట్టకుండా లంకను జయించటం దేవతలకే సాధ్యం కాదు. అందుచేత విచారం విడిచిపుచ్చి కర్తవ్యం ఆలోచించు. నీకు జయం కలుగుతుందనటానికి ఏ సందేహమూ లేదు,'' అన్నాడు.

యుద్ధకాండ – 1



ఈ మాటలతో రాముడు తేరుకుని, ''తపస్సు చేసో, సేతువు కట్టో, సముద్రాన్ని ఇంకించో, ఏదో విధంగా లంకకు చేరి తీరు తాను. ఆ విషయమై ఇంక విచారించను,'' అంటూ హనుమంతుడితో, ''లంకకు ఎన్ని దుర్గాలున్నాయి? ఎంత సైన్యం ఉన్నది? ద్వారరక్షణ ఎలా ఉన్నది? ప్రాకారాలు మొదలైన వాటిని గురించి వివరంగా చెప్పు,'' అన్నాడు.

హనుమంతుడీ విధంగా చెప్పాడు:

''లంకలోని వారంతా సంతృప్తులు, అసం తృప్తులక్కడ లేరు. నగరం విశాలమైనది. పుష్కలంగా చతురంగ బలాలు గలది. దానికి నాలుగు పెద్ద ద్వారాలున్నాయి. ద్వారాల వద్ద శత్రు సైన్యాలను నాశనం చెయ్యడానికి బ్రహ్మాండమైన రాళ్ళు విసిరే యంత్రాలున్నాయి, నూరేసి మందిని చంప గల శతఘ్నులున్నాయి. నగరం చుట్టూ దాటరాని ప్రాకారం ఉన్నది. దాని చుట్టూ లోతైన అగడ్త ఉన్నది. దానిని దాటటానికి ద్వారాల సమీపంలో కర్రవంతెనలున్నాయి. వాటిని యంత్ర సహాయంతో ఎత్తవచ్చు, దించవచ్చు. శత్రువులు వచ్చినప్పుడు వాటిని ఎత్తివేస్తే, అగడ్తను దాటటం అసాధ్యం. రావణుడు చాలా మెలకువ గలవాడు. శత్రు భయం లేనప్పుడు కూడా తన సైన్యాన్ని యుద్ధ సన్నద్ధంగా ఉంచుతాడు. లంకకు నాలుగు రక్షలున్నాయనవచ్చు. ఒకటి, చుట్టూ ఉండే సముద్రం. లంక ఎత్తుగా త్రికూట పర్వతం పైన ఉండటం చేత దానిని ఎక్కి లంకను చేరాలి. ఆ పర్వతం రెండో రక్ష. అక్కడ ఉండే అరణ్యం మరొక రక్ష. నాలుగో రక్ష అగడ్తా, పరిఘలూ, యంత్రాలూ, శతఘ్నులూ మొదలైనవి. ద్వారాల వద్దా, నగర మధ్యంలోనూ యోధులైన రాక్షసులు కోట్ల సంఖ్యలో ఉన్నారు. అయితే, నేను అగడ్తలను దాటే వంతెనలను ధ్వంసం చేసి, అగడ్తను పూడ్చాను. ప్రాకారాన్ని ధ్వంసం చేశాను. చాలా మంది పరాక్రమవంతులైన రాక్షసులను చంపాను. కనుక ఇప్పుడు లంకను వశపరచుకొనటం అంత కష్టం కాదు. మిగతా సైన్యంతో కూడా పనిలేదు; అంగ దుడూ, ద్వివిదుడూ, మైందుడూ, జాంబవం తుడూ, పనసుడూ, నళుడూ, సేనానాయకు డైన నీలుడూ చాలు. వీళ్ళు తలుచుకుంటే లంకను పెళ్ళగించి, రాక్షసులతో సహా తేగ

లరు. అందుచేత అంగదుడు మొదలైన వారిని ఆజ్ఞాపించి, మంచి ముహూర్తం చూసి బయలుదేరదీయించు.''

రాముడంతా విని హనుమంతుడితో, ''సరే, ఆ లంకను అవశ్యం హతమార్చుదాం,'' అన్నాడు. అతను సుగ్రీవుడితో, ''మనం ఇవాళే, ఇప్పుడే సేనలతో బయలుదేరి పోదాం. సరిగా మిట్టమధ్యాహ్నమయింది. ఇది అభిజిత్తు అనే ప్రశస్తమైన ముహూర్తం. కార్యసాధన అవుతుంది. అదీ గాక, ఇవాళ ఉత్తర ఫల్గునీ నక్షత్రం. నా జన్మ నక్షత్రం పునర్వసు గనుక ఇది నాకు అనుకూలం. ఇంకా అనేక శుభ లక్షణాలు కనిపిస్తున్నాయి గనుక వెంటనే బయలుదేరుదాం,'' అన్నాడు.



వానరసేనలో ముందెవరుండాలో, దాని పార్శ్వాలను ఎవరు రక్షించాలో, ఏయే వానర యోధుడేయే పని నిర్వర్తించాలో, మార్గ మధ్యంలో శత్రువులు అవాంతరాలు కలిగించకుండా ఎలా జాగ్రత్తపడాలో రాముడు వానర సేనానాయకుడైన నీలుడితో చెప్పాడు. ఉదాహరణకు, వానరసేన వెళ్ళే మార్గంలో ఉండే పళ్ళూ, ఫలాలూ మొదలైన ఆహారాన్ని రాక్షసులు నిర్మూలించవచ్చు. లోయలలోనూ, నదులు దాటే చోటా, అరణ్యాలలోనూ శత్రువులు మాటు వేసి ఉండి వానరసేనను నిర్మూలించ యత్నించవచ్చు. అలాటి ప్రమాదాలేవీ జరగకుండా ముందు నడిచే వారు జాగ్రత్త తీసుకోవాలి.

ప్రయాణం కావలిసిందని సుగ్రీవుడాజ్ఞాపించగానే యుద్ధోత్సాహులైన వానరులు గుహల నుంచీ, కొండల మీది నుంచీ, చెట్ల మీది నుంచీ దూకుతూ వచ్చారు. వానర సేన దక్షిణంగా కదిలింది. రాముణ్ణి హనుమంతుడూ, లక్ష్మణుణ్ణి అంగదుడూ తమ భుజాల పైన ఎక్కించుకున్నారు. అసంఖ్యాకులైన వానరులు వారిని చుట్టుముట్టి నడుస్తూ, ఎగిరారు, గంతులు వేశారు, సింహనాదాలు చేశారు, ఒకరినొకరు పడదోసుకున్నారు, పరుగుపందాలు వేసుకున్నారు, ''రావణుణ్ణి చంపాలి; రాక్షసులను చంపాలి,'' అని నినాదాలు చేశారు. మహా పరాక్రమవంతులైన వానరోత్తములు, ఋషభుడూ, నీలుడూ, కుముదుడూ పెద్ద బలగంతో సేనకు ముందుండి దారి తీశారు.

దారిలో లక్ష్మణుడు రాముడికి ఉత్సాహం కలిగిస్తూ, ''ఇక త్వరలోనే రావణుడు

చస్తాడు. సీతకు విమోచనం కలుగుతుంది. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది, నక్షత్రాలు అనుకూలంగా ఉన్నాయి. రాక్షసుల నక్షత్ర మైన మూలా నక్షత్రాన్ని తోకచుక్క తాకుతున్నది,'' అన్నాడు.

దారి పొడుగునా వానరులు చేయవలసిన కోతి చేష్టలన్నీ చేస్తూ, చెట్ల మీదుగానూ, చెట్ల కిందుగానూ నడుస్తూ, కుప్పి గంతులు వేస్తూ, ఎగురుతూ, కిచకిచలాడుతూ, చెట్ల కొమ్మలు విరుస్తూ, ఫలాలు తిని తేనెలు తాగుతూ, ఎక్కడా మజిలీ వెయ్యకుండా, సహ్యపర్వతాన్నీ, మలయపర్వతాన్నీ దాటి సముద్రతీరాన్ని చేరుకున్నారు.

రాముడు లక్ష్మణ సుగ్రీవులతో సహా మహేంద్రగిరి శిఖరానికి ఎక్కి, అక్కడి నుంచి సముద్రాన్ని చూశాడు. తరవాత పర్వతం దిగివచ్చి సముద్రాన్ని దగ్గిరగా చూశాడు. అతను సుగ్రీవుడితో, ''ఇక మన ముందు సముద్రమే గాని భూమి లేదు. దీన్ని దాటటానికి ఏదో ఉపాయం ఆలోచించాలనుకున్నామే, ఆ ఉపాయం ఆలోచించే సమయం వచ్చింది. ప్రస్తుతానికి సేనలను ఇక్కడే విడియిద్దాం. శత్రుభయం కలగకుండా వానరులు కాపలా తిరుగుతూ ఉండాలి,'' అన్నాడు.

సుగ్రీవుడు ఆజ్ఞాపించగా వానరసేన మూడు విభాగలై విడిసింది. ఆ సమయంలో వానరులు చేసిన ధ్వని మూలాన సముద్ర ఘోష కూడా వినరాలేదు. వానరులు సముద్రాన్ని చూసి మహాశ్చర్యం పొందారు. దీన్ని ఎలా దాటటమా అని దిగులు చెందారు.



వానరసేనాని అయిన నీలుడు సేనా నివేశనం శాస్త్రోక్తంగా జరిపించాడు. వానరోత్త ములైన మైందద్వివిదులు సేనకు రక్షకు లుగా రెండు పక్కలా సంచరించారు.

సైన్యం విడిసే ఏర్పాట్లు పూర్తికాగానే రాముడు సీతను తలుచుకుని లక్ష్మణుడితో తన బాధ చెప్పుకుని విలపించాడు. ఇంతలో సూర్యాస్తమయమయింది. లక్ష్మణుడు ఓదార్చిన మీదట రాముడు వ్యాకుల మనస్సు తోటే సంధ్యోపాసన చేశాడు.

ఈ లోపల అక్కడ లంకలో, రావణుడు ఘోరమైన అవమానం పొంది రాక్షస ప్రముఖు లతో, ''శత్రువులకు అభేద్యమైన లంకలోకి ఒక వానరమాత్రుడు ప్రవేశించి, గొప్ప గొప్ప రాక్షస వీరులను చంపి, లంకను దహించి అల్లకల్లోలం చేసేశాడు; సీతతో మాట్లాడి మరీ వెళ్ళాడు. ఇప్పుడు రాముడు వేలకొద్దీ వానర వీరులను వెంటబెట్టుకుని మన పైకి ఎత్తి వస్తున్నాడు. అతను తన తమ్ముడితోనూ, సుగ్రీవుడు మొదలైన వారి తోనూ, వానర సేనతోనూ సముద్రాన్ని దాటి రాగలడనటానికి సందేహం లేదు. అతను స్వశక్తి చేత సము ద్రాన్ని ఎండించవచ్చు, లేక మరొకటి చేయ వచ్చు. అతను వానరబలగంతో వచ్చిపడే పక్షంలో మనం లంకనూ, మననూ రక్షించు కునే ఉపాయమేమిటి? అందరూ శాస్త్రీ యంగా ఆలోచించి, ఏకాభిప్రాయానికి వచ్చి కర్తవ్యం నిర్ణయించండి,'' అన్నాడు.

ఈ మాటలు విని రాక్షసులు, ''రాక్షసేశ్వరా, నీకీ విషయమై చింత ఎలా కలిగింది? మనకు



అంతులేని సేన ఉన్నది; అంతులేని పరి ఘలూ, శక్తులూ, శూలాలూ, పట్టసాలూ మొదలైన ఆయుధాలున్నాయి. నీవా ముల్లో కాలనూ జయించిన వాడవు. కుబేరుణ్ణీ, యక్షులనూ జయించి పుష్పకం తెచ్చుకు న్నావు. మయుడు నీకు వెరిచి తన కూతు రును (మందోదరిని) నీకు భార్యగా ఇచ్చాడు. వాసుకీ, తక్షకుడూ మొదలైన నాగరాజులు నీకు లోబడ్డారు. అపారశక్తిమంతులూ, మాయా వులూ అయిన కాలకేయులు నీతో ఏడాది పాటు యుద్ధంచేసి చివరకు ఓడారు. వరు ణుడూ, యముడూ నీచేత జయించబడ్డారు. వారందరినీ జయించిన నీకు రాముడొక లెక్కా? నీ దాకా ఎందుకు? మహేశ్వర యజ్ఞం చేసి, వరప్రసాదుడై, దేవేంద్రుడితో యుద్ధం చేసి, అతన్ని కట్టి లంకకు తెచ్చిన

ఇంద్రజిత్తు చాలడా? క్షణంలో ఆ రాముణ్ణీ, వానర సేననూ మట్టుబెట్ట గలడు! వానరుడైన హనుమంతుడు చేసిన అల్లరిని తలచి బాధ పడకు, ఆ సంగతి మరిచి పో!'' అన్నారు మితి మించిన అహంకారంతో. వారు అవివేకులు, మీదు మిక్కిలి శత్రుబలం ఏమాత్రమూ ఎరగరు.

వెంటనే ప్రహస్తుడు లేచి రావణుడికి నమస్కారం చేసి, ''దేవ దానవ గంధర్వ పిశాచాదులకు భయపడని మనం కోతులకు భయపడతామా? మనని జయించే వారు లేరన్న అలక్ష్యంలో ఉన్న కారణం చేత హనుమంతుడు అల్లరి చేశాడు గాని, నేను జీవించి ఉండగా వాడు ప్రాణాలతో లంకను దాటునా? నన్ను ఆజ్ఞాపించు, భూమి మీద ఎక్కడా వానర మనేది మచ్చుకు కూడా లేకుండా చేసేస్తాను. లంకను కాపాడే పని నాకు వదిలెయ్యి!'' అన్నాడు.

''హనుమంతుడు మనకూ, మన రాజుకూ చేసిన అవమానం నిజంగా క్షమించరానిదే. నేనొక్కణ్ణే వెళ్ళి ఆ వానరులనందరినీ చంపి వస్తాను,'' అన్నాడు దుర్ముఖుడు. వజ్రదంష్ట్రుడు కోపంతో, ఇనుప గుదియ ఒకటి చేతబట్టి, ''అర్ధ రాత్రివేళ దొంగలాగా వచ్చిన ఆ హనుమంతుడితోనేమిటి? నేను వెళ్ళి, నిజమైన శూరుడైన ఆ రాముణ్ణి లక్ష్మణ సుగ్రీవులతో సహా చంపేస్తాను. రాజా, మరొక మాట చెబుతాను. మనం శత్రువులను ఉపాయంతో జయించవచ్చు. కామరూపులైన మన రాక్షసులు వేల సంఖ్యలో మనుష్య రూపం ధరించి రాముడి వద్దకు వెళ్ళి, ''మమ్మల్ని భరతుడు పంపాడు, ఆయన పెద్ద సేనతో వస్తున్నాడు!'' అని చెప్పాలి. రాముడు ఆ ఆశలో ఉండగా మనం ఇక్కడి నుంచి వెళ్ళి, వానరసేన అంతా నిర్మూలిస్తాం. రామలక్ష్మణులు అది చూసి గుండెపగిలి చస్తారు,'' అన్నాడు.

ఇదే విధంగా కుంభకర్ణుడి కొడుకు నికుంభుడు తానొక్కడే వెళ్ళి వానర సేననూ, రామలక్ష్మణులనూ చంపి వస్తానన్నాడు. వజ్రహనుడనే వాడు వానరులనందరినీ తిని వస్తానన్నాడు. ఇంకా అనేక మంది రాక్షస వీరులు శత్రు నాశనానికి సన్నద్ధులై లేచి నిలబడ్డారు.






# అగ్ని పరీక్ష

పురందర రాజకుమార్తె లావణ్య అందంలో దేవతా స్త్రీలకు సాటి రాగలది. తగిన వరుడు దొరికితే ఆమెకు వివాహం చెయ్యాలనే ఉద్దేశంతో ఉన్నాడు రాజు. పురందరదేశం ఆ కాలంలో మారుమూల దేశం. ఆ దేశం నుంచి మరే దేశానికి వెళ్ళాలన్నా అనేక రోజులపాటు అరణ్యాలలోనూ, కొండల మీదా ప్రయాణాలు చెయ్యాలి. లావణ్యకు తగిన వరుడు దొరకక పోవటానికి అదే ప్రధానకారణం.

లావణ్య కూడా వివాహం కోసమే ఎదురు చూస్తున్నది. ఆమెకు తన నిత్యజీవితంలో ఏమీ ఆనందం కనిపించలేదు. రాజభవనంలో ఆమె చెలికత్తెలు ఆమెను వినోదింపజేయటానికి చెప్పిన కథలే మళ్ళీ మళ్ళీ చెబుతారు. ఆడిన ఆటలే మళ్ళీ మళ్ళీ ఆడతారు. అందుచేత ఆమెకు కాలం గడవటమే కష్టంగా ఉన్నది.

ఒకనాడు ఆమె రాజభవనంలో ఎవరికీ చెప్పకుండా, తమ నగరానికి ఉత్తరాన ఉన్న వనాలకు ఒంటరిగా బయలుదేరింది. ఆమె పరధ్యానంగా నడుచుకుంటూ వెళ్ళి ఒక అత్యద్భుతమైన ఉద్యానవనంలో ప్రవేశించింది. ఎటు చూసినా అమిత అందంగా ఉన్న పొదలూ, వాటిలో అపూర్వమైనపుష్పాలూ కనిపించాయి. ఆ ప్రాంతం మనుషులు పెంచిన తోటగానూ లేదు, సహజంగా తయారైన వనంగానూ లేదు. అక్కడ ఎలాటి జన సంచారమూ ఉన్నట్టు కనిపించలేదు. ఆఖరుకు జంతువులూ, పక్షులూ కూడా ఆమెకు కనిపించలేదు.

లావణ్య ఒక్కొక్క పొద వద్దకూ వెళ్ళి, దానికి గల పూల అందమూ, సువాసనా అనుభవిస్తూ తిరగసాగింది. ఒక పొద మీద ఆమెకు అన్నిటికన్నా అందమైన పూలు కనిపిం

25-ఏళ్ళనాటి చందమామ కథ



చాయి. వాటి సువాసన వర్ణనాతీతంగా ఉన్నది. ఆమె ఒక పువ్వు కోసి తలలో పెట్టుకో బోయింది. ''ఎవరా పూలు కోసేది?'' అని గర్జిస్తూ ఒక యువకుడు ఒక పొదచాటు నుంచి లావణ్య ఎదటికి వచ్చాడు. ఆమెను చూడగానే అతనిలో విచిత్రమైన మార్పు వచ్చింది. ఏదో అనబోతూ అతను ఆమె కేసి కన్నార్పకుండా చూడసాగాడు.

''పూలు కొయ్యరాదని నాకు తెలియదు. అడగటానికైనా ఎవరూ కనిపించలేదు. ఇక్కడ ఎవరూ లేరనే అనుకున్నాను,'' అన్నది లావణ్య.

యువకుడు చిన్నగా నవ్వి, ''అవునవును. ఇక్కడ ఎవరూ ఉండరు. నేను మాత్రం ఈ వనానికి కాపలా కాస్తూ ఇక్కడే ఉంటాను,'' అని, ఆమె ముందు కోసుకున్న పొద నుంచే మరికొన్ని పూలు కోసి ఆమె చేతిలో పెట్టాడు.

''పూలు కోయరాదన్నారుగా?'' అన్నది లావణ్య.

''నీ అంత అందగత్తెకు నియమాలు అవసరం లేదు,'' అన్నాడతను.

''మీ రెవరు?'' అని లావణ్య అడిగింది.

''నా పేరు సువ్రతుడు. ఈ గంధర్వ వనానికి పాలకుణ్ణి,'' అన్నాడు ఆ యువకుడు.

''గంధర్వుడివా!'' అంటూ లావణ్య తన చేతిలో ఉన్న పూలను కింద వదిలేసింది.

గంధర్వులంటే అందరికీ ఉన్నట్టే లావణ్యకు కూడా భయం ఉన్నది. వాళ్ళ స్నేహం మామూలు మానవులకు అచ్చిరాదు. వాళ్ళు అనేక విద్యలు నేర్చినవాళ్ళు. అయితే, గంధర్వులు తమ దేశానికి అంత దగ్గరలో ఉంటున్నట్టు లావణ్యకు తెలియదు.

ఆమె కంగారు చూసి సువ్రతుడు, ''భయపడకు రాజకుమారీ. నేను ప్రస్తుతం గంధర్వులకు కింకరుడుగా ఉంటున్నప్పటికీ, జన్మతః నీలాటి మానవుణ్ణే. మా తాతగారు ఇక్కడికి తూర్పుగా ఉన్న జయసింధుదేశపు రాజు. నేను పసివాణ్ణిగా ఉండగానే నా తల్లి తండ్రులు పోయారు. అప్పుడు నా మాతామహుడు నన్ను తన ఇంటికి తెచ్చి పెంచాడు. నేను కొంచెం పెరిగినాక మా తాత వెంట ఈ ప్రాంతాలకే వేటకు వచ్చాను. అప్పుడు నన్ను ఒక గంధర్వరాణి పట్టుకుని తీసుకుపోయింది. నేను తనను ప్రేమించి తనకు భర్తగా ఉంటానని ఆమె ఆశ. నేను ఆమెను ప్రేమించలేను. అందుచేత పగటిపూట నన్ను ఈ వనానికి కాపలా ఉంచింది. రాత్రికాగానే నన్ను ఆమె



తమ లోకానికి తీసుకుపోతూ ఉంటుంది. నాకు ఈ గంధర్వులన్నా, వీళ్ళ లోకమన్నా రోజు రోజుకూ అసహ్యం పట్టుకున్నది. వీళ్ళ మాయనుంచి నన్ను ఎవరన్నా తప్పిస్తారా అని ఎంతో ఆశపడతాను. కాని నా ఆశ ఫలించదు. అది ఫలించే మార్గం అందుబాటులో కనపడదు!'' అంటూ నిట్టూర్చాడు.

అతను మాట్లాడుతున్నంతసేపూ అతన్ని కన్నార్పకుండా చూస్తూ ఉండిన లావణ్య, అతని స్థితికి ఎంతో జాలిపడుతూ, ''ఏమిటా మార్గం?'' అని అడిగింది.

సువ్రతుడు లావణ్య కేసి అనుమానంగా చూస్తూ ఇలా చెప్పాడు:

''ప్రతి పౌర్ణమినాటి రాత్రీ గంధర్వరాణి తన పరివారంతో వచ్చి ఈ వనంలో విహారాలు చేస్తుంది. నేను ఆమె వెంటనే ఉంటాను. ఆ సమయంలో మనిషి జన్మ ఎత్తిన వారెవరైనా పట్టుకోవాలి. గంధర్వరాణి తన మాయలు ప్రయోగించి ఆ మనిషిని భయంకరమైన పరీక్షలకు గురిచేస్తుంది. వాటికి తట్టుకుని నన్ను ఆ మనిషి గట్టిగా పట్టుకోవాలి. అప్పుడు గాని నేను గంధర్వుల బారినుంచి బయటపడను. నా కోసం ఇంత బాధపడే మనిషికి నేనంటే ఎంత ప్రేమ ఉండాలి! ఎంత సాహసం కావాలి! నన్ను ఎరిగినవాళ్ళే మానవప్రపంచంలో ఉన్నారా, లేదా అని నాకు అనుమానంగా ఉంది. అలాటప్పుడు నన్ను కాపాడే వాళ్ళు ఉంటారనుకోవటం భ్రమేగదా!''

సువ్రతుడు ఇలా అని పెద్దగా నిట్టూర్చి, ''సూర్యుడు వాలి పోతున్నాడు. నువ్వు ఎంత దూరం వెళ్ళాలో. చీకటి పడే వేళకు నువ్వు ఇక్కడ ఉండటం క్షేమం కాదు!'' అన్నాడు.

''నీకు త్వరలోనే గంధర్వుల నుంచి విముక్తి కలుగుతుందనుకుంటాను. వస్తాను!'' అని లావణ్య తన ఇంటికి బయలుదేరి వెళ్ళి పోయింది.

పూర్ణిమ ఇంకా నాలుగు రోజులున్నది. ఈ నాలుగు రోజులూ లావణ్య సువ్రతుణ్ణి గురించి విడవకుండా ఆలోచించి, అతన్ని కాపాడటానికి, అవసరమైతే ఆ ప్రయత్నంలో ప్రాణాలు విడవటానికీ దృఢంగా నిశ్చయించుకున్నది.

పూర్ణిమనాటి సాయంకాలం ఆమె గంధర్వ వనానికి ఒంటరిగా బయలుదేరి వచ్చింది. చీకటిలో ఎవరికీ కనిపించకుండా ఉండటానికి నల్లని దుస్తులు ధరించింది. చీకటి పడక ముందే ఆమె పొదలలో దాగి కూర్చున్నది.

ఝాము రాత్రి గడిచినాక వనంలో అలికిడి వినిపించింది. గంధర్వులు జంటలు జంటలుగా వనంలో షికార్లు చేస్తున్నారు. లావణ్య ప్రతి జంటా తన పక్కగా వెళ్ళినప్పుడల్లా, వారిలో గంధర్వరాణి ఉన్నదేమో అని శ్రద్ధగా పరిశీలిస్తున్నది. దాదాపు అర్ధరాత్రి కావస్తూండగా సువ్రతుడూ, మరొక స్త్రీ ఆమె దాగి ఉన్న ప్రాంతానికి వచ్చారు. సువ్రతుడి వెంట ఉన్న స్త్రీ గంధర్వరాణి అయి ఉంటుందని లావణ్య సులువుగానే గ్రహించింది. ఆ జంట తనకు సమీపంగా రాగానే లావణ్య చప్పున లేచి వెళ్ళి సువ్రతుణ్ణి గట్టిగా కౌగలించుకున్నది.

గంధర్వరాణి ఒక క్షణంపాటు నివ్వెరపోయి, సువ్రతుడు తన చేతి నుంచి జారిపోతున్నాడని గ్రహించి, మాయలు ప్రయోగించింది.

లావణ్య కౌగిట ఉన్న సువ్రతుడు అంతలో ఒక కొండచిలువగా మారాడు. దేనికైనా తెగించి ఉన్న లావణ్య ఆ కొండ చిలువను వదిలి పెట్టలేదు.

ఇంతలో కొండచిలువ సింహంగా మారింది. లావణ్య గుండెలు అదిరి పోయాయి, కాని ఆమె ఆ సింహాన్ని గట్టిగా వాటేసుకున్నది. ఇంతలో సింహం ఎర్రగా కాలుతున్న గునపంగా మారింది. లావణ్య శరీరమంతా చుర్రున కాలి భరించరాని బాధ కలిగింది. కాని లావణ్య గునపాన్ని విడవలేదు.

తరవాత ఏమి జరిగినదీ ఆమెకు తెలియదు. ఆమెకు స్పృహతెలిసేసరికి గంధర్వ వనంలో ఎవరూ లేరు. ఆమె కౌగిట సువ్రతుడున్నాడు. ఆమెతోపాటే అతనికీ స్పృహ వచ్చింది.

''నన్ను గంధర్వుల నుంచి కాపాడావు. నీ ఋణం ఎలా తీర్చుకోగలను? మనం మీ నగరానికి పోదాం పద. నిన్ను ఇంటికి చేర్చినదాకా నా సంగతి చూసుకోలేను,'' అన్నాడు సువ్రతుడు లావణ్యతో.

రాజకుమార్తె కనపడక రాజభవనం ఆందోళనతో సతమతమవుతున్నది. లావణ్య జరిగినదంతా చెప్పగానే ఆమె తండ్రి, ''నాయనా, నీకోసం నా కుమార్తె అగ్ని పరీక్ష ఎదుర్కొన్నది. నీకన్న ఆమెకు తగిన భర్త ఎవరుంటాడు?'' అని సువ్రతుడితో అని, వారిద్దరికీ పెళ్ళి చేసేశాడు.





# నిజమైన రాజు

వైశాలినీ రాజ్యం రాజు మహేంద్రపాలుడు మహా వీరుడు; ఆదర్శపాలకుడు. ఆయన పాలనలో రాజ్యం సర్వతో ముఖాభివృద్ధి గాంచింది. ఆ రాజ్యాన్ని ఆదర్శంగా తీసుకుని పలువురు రాజులు తమరాజ్యాల్లో సంక్షేమ కార్యక్రమాలను చేపట్టారు.

మహేంద్రపాలుడికి వృద్ధాప్యం సమీపించడంతో, తన ఏకైక వారసుడు సువర్ణపాలుడికి సింహాసనాన్ని అప్పగించి వానప్రస్థం స్వీకరించాలని నిర్ణయించాడు.

సుగుణవతీ, అపురూప సౌందర్యరాశీ అయిన చంద్రగిరి రాజ కుమార్తె లావణ్య లతతో కుమారుడి వివాహాన్ని ఘనంగా జరిపించాడు. ఆ తరవాత ఒక శుభముహూర్తాన వేద పండితులు వేద మంత్రాలు చదువుతూండగా సువర్ణపాలుడు వైశాలినీ రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించాడు.

ఆనాటి రాత్రి మహేంద్రపాలుడు కుమారుణ్ణి అంతరంగిక మందిరానికి రప్పించి, ''వంద సంవత్సరాల క్రితం మన రాజ్యంలో కనీ వినీ ఎరుగని కరువు సంభవించింది. తీవ్ర వర్షాభావంతో పంటలు పండక ప్రజలు అష్టకష్టాల పాలయ్యారు. అప్పటి రాజైన మా పితామహుడు విక్రమ సింహుడు ఎన్ని యజ్ఞ యాగాలు చేసినా వర్షాలు కురవలేదు. ఆ సమయంలో హిమాలయాల నుంచి వచ్చిన ఒక యోగి ఆయనకు ఒక ఉంగరం ఇచ్చి, అది మహారాజు వేలికి ఉన్నంత కాలం రాజ్యం సుభిక్షంగా ఉంటుందని చెప్పి ఆశీర్వదించి వెళ్ళాడు. ఆ రోజే వర్షం మొదలై క్రమంగా రాజ్యం సుభిక్షమయింది. ఆ ఉంగరాన్ని విక్రమ పాలుడు మా తండ్రి చందనపాలుడికిచ్చాడు. ఆయన నాకిచ్చాడు. ఇప్పుడు నేను దాన్ని నీకిస్తున్నాను. ఈ ఉంగరం మహిమాన్వితమై

ఎన్. శివనాగేశ్వరరావు



నది. ఎట్టిపరిస్థితులలోనూ దీన్ని నీ వేలి నుంచి తీయకు. నీ తరవాత దీన్ని నీ తనయుడికి అప్పగించు. ప్రలకు ఎలాంటి కొరతారాదు. ప్రజాక్షేమమే రాజుకు ప్రాణసమానమన్న సంగతి మరువకు,'' అని చెప్పి ఉంగరాన్ని సువర్ణపాలుడి వేలికి తొడిగాడు.

''మీ ఆజ్ఞను శిరసావహిస్తాను,'' అని చెప్పి సువర్ణపాలుడు సంతోషంగా అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆ తరవాత సంవత్సరకాలానికి మహేంద్ర పాలుడు కాలధర్మం చెందాడు. సువర్ణ పాలుడు తండ్రి అడుగు జాడల్లో ధర్మంగా పాలన సాగించసాగాడు.

ఒకనాడు మహారాణి లావణ్యలత భర్తతో, ''చాలా కాలంగా సముద్ర విహారం చేసిరా వాలని కోరికగా ఉన్నది,'' అని చెప్పింది.

గర్భవతిగా ఉన్న ఆమె కోరికను మన్నించిన రాజు సముద్ర విహారానికి సకలసదు పాయాలూ కలిగిన ఒక అందమైన విహార నౌకను సిద్ధం చేయించాడు.

సముద్రంలో నౌక మీద విహరిస్తూండగా రాజు ఉంగరాన్ని చూసిన లావణ్యలత, ''మహారాజా, మీ వేలి ఉంగరాన్ని ఒక్కసారి ధరించాలని ఉన్నది,'' అన్నది.

మహారాణి కోరిక వినగానే సువర్ణపాలుడి మనసులో ఉంగరాన్ని ఎట్టి పరిస్థితులలోనూ చేతి నుంచి తీయరాదన్న తండ్రి హెచ్చరిక గుర్తుకు వచ్చింది. అయినా, రాణి కోరిక మన్నించకపోతే ఆమె బాధ పడుతుందని భావించిన రాజు తన వేలి ఉంగరాన్ని తీసి ఆమెకు అందించాడు.

ఆమె ఉంగరాన్ని తొడుక్కునేలోగా బల మైన అలలు లేచి నౌకను తాకడంతో, ఆ ఊపుకు చేతిలోని ఉంగరం ఎగిరి సాగర జలాల్లో పడిపోయింది. రెప్పపాటు కాలంలో జరిగిపోయిన ఈ దుర్ఘటనకు రాజు నిశ్చేష్టు డయ్యాడు. వెంటనే తేరుకుని గజ ఈత గాళ్ళను పిలిచి విషయం వివరించి ఉంగ రాన్ని వెతకమని ఆజ్ఞాపించాడు. ఎంత వెతికినా ఉంగరం జాడ కనిపించలేదు.

ఇదంతా తన వల్లనే జరిగినందుకు మహా రాణి ఎంతగానో బాధ పడుతూ రాజుకు క్షమాపణ చెప్పింది.

చింతాక్రాంతుడైన రాజు నౌకను వెనక్కు మళ్ళించి రాజభవనం చేరాడు. ఆ తరవాత కూడా కొన్నాళ్ళపాటు జాలరులు వలలు



విసిరి ఉంగరం కోసం వెతికారు. కాని ప్రయో జనం లేకపోయింది.

కాలం ముందుకు సాగి వర్ష రుతువు వచ్చినా వాన చినుకు మాత్రం పడలేదు. క్రమంగా పొలాలు బీళ్ళయ్యాయి. వరస కరువులు ఆరంభమయ్యాయి. ఇదంతా తాను ఉంగరాన్ని పోగొట్టుకోబట్టేనని రాజు భావించసాగాడు. తండ్రి ఆనతిని ఉదాసీన పరచినందుకు క్షమించమని దేవుళ్ళను ప్రార్థించాడు. అయినా వర్షం కురవలేదు.

అలాంటి పరిస్థితుల్లో పొరుగురాజ్యం నుంచి సుదర్శనుడనే వృద్ధ పండితుడు రాజును దర్శించి, ''మహారాజా, నాకు సాగర దర్శిని అనే విద్య తెలుసు. దాని సాయంతో సాగర గర్భంలోని అతి చిన్న వస్తువులను కూడా పైనుంచే దర్శించగలను. కోరిన వారికి చూపగలను. దాని ద్వారా మీరు పోగొట్టు కున్న మహిమాన్వితమైన ఉంగరాన్ని కనుగొన డానికి ప్రయత్నిస్తాను. అది లభించినట్ట యితే మీ రాజ్యాన్ని పట్టి పీడిస్తున్న క్షామం అంతరించి, ప్రజల కష్టాలు తొలగి పోగలవని భావిస్తున్నాను,'' అన్నాడు.

ఆ మాట వినగానే రాజుకు సుదర్శనుడు దైవస్వరూపుడిలా కనిపించాడు. ''వెంటనే మన సముద్రయానానికి ఏర్పాట్లు చేస్తాను,'' అన్నాడు.

మరునాడు సువర్ణపాలుడు, సుదర్శనుడి వెంట నౌకలో సముద్రంలోకి బయలుదే రాడు. సుదర్శనుడు మంత్రం పఠిస్తూ చట్రంలో బిగించిన దుర్భిణి ద్వారా సముద్ర జలాలలోకి చూడసాగాడు. ఆయన నేత్రా లకు లోతున ఉన్న సముద్ర జీవులు, ఖనిజ సంపదలు, ఎప్పుడో మునిగి పోయిన ఓడలు, పడవలు స్పష్టంగా కనిపించసాగాయి.

ఇలా కొన్ని గంటలు గడిచాక సుదర్శనుడి అన్వేషణ ఫలించి, రాజు పోగొట్టుకున్న మహిమగల ఉంగరం గోచరించింది. లంగరు దించబడి, సుదర్శనుడి అనుజ్ఞతో గజ ఈత గాళ్ళు కొందరు సముద్రంలోకి దూకి ఉంగరం కోసం ఆయన చెప్పిన చోట వెదకసాగారు. అయితే, నీళ్ళలోకి దూకాక వారికి ఉంగరం జాడ కనిపించకుండా పోయింది. ఆ తరవాత జాలరులు వలలు విసిరి చూశారు గాని, ఎవరి ప్రయత్నాలూ ఫలించలేదు. ఒట్టి చేతులతో తిరిగివచ్చిన వాళ్ళను చూసిన రాజు తీవ్రమైన ఆశాభంగానికి గురయ్యాడు.

అప్పుడు సుదర్శనుడు, ''రాజా, ఆ ఉంగరం మహిమాన్వితమైనది కదా? అర్హులకు మాత్రమే చేజిక్కుతుంది,'' అన్నాడు.

''మరి, ఆ కార్యం ఎవరు సాధించగలరు?'' అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

''అది మీ ఒక్కరికే సాధ్యం!'' అన్నాడు సుదర్శనుడు.

''మహారాజుకు ఈతసరిగా రాదు. ఆయన సముద్రంలోకి దూకడమా? మహారాజు క్షేమం ప్రధానం. అది సాధ్యంకాని పని,'' అన్నారు రాజుగారి అంగరక్షకులు ఒక్కసారిగా.

''దీనికంతటికీ కారణం నాతప్పిదం. దాని మూలాన ప్రజలు శిక్షించబడకూడదు. వాళ్ళ బాధలు చూస్తూ బతకడంకంటే, వాటిని పోగొట్టే ప్రయత్నంలో ప్రాణాలు కోల్పోయినా ఫరవాలేదు,'' అంటూ రాజు ఒక్క గెంతున సముద్రంలోకి దూకి అడుగుకు ఈదుకుంటూ వెళ్ళాడు.

ఆయనకు ఒక చోట మిలమిలా మెరుస్తూ ఉంగరం కనిపించింది. దాన్ని తీసుకుని క్షణంలో పైకి వచ్చాడు. నౌకను చేరిన రాజు, సుదర్శనుడికి కృతజ్ఞతలు తెలియజేసి, తండ్రికి మనసులోనే క్షమాపణలు చెప్పి, ఇష్టదైవాన్ని స్మరిస్తూ ఉంగరాన్ని వేలికి ధరించాడు.

వాళ్ళు ఒడ్డును చేరేసరికి ఆకాశం మేఘావృతమై వర్షం కురవడం ఆరంభమయింది. వారం రోజుల్లో వాగులు, వంకలు, నదులు నిండుగా ప్రవహించసాగాయి. కొన్నాళ్ళలో రాజ్యం సస్యశ్యామలయింది. ప్రజలు పరమానందం చెందారు.

వీటన్నిటికీ కారకుడైన సుదర్శన పండితుణ్ణి రాజు నిండుసభలో ఘనంగా సన్మానించాడు. అప్పుడు సుదర్శనుడు, ''మహారాజా! ఇందులో నాగొప్పతనం ఏమీ లేదు. ప్రజల క్షేమం కాంక్షించి తన ప్రాణాలను సైతం తృణప్రాయంగా భావించే రాజు దైవసమానుడు. అతడే నిజమైన రాజు. అలాంటి రాజుకు సాయపడడానికి పంచభూతాలు కలిసికట్టుగా వస్తాయి. రాజ్యాన్ని సుభిక్షం చేస్తాయి. అలాంటి రాజ పరంపరను పొందిన వైశాలినీ ప్రజలు భాగ్యవంతులు,'' అన్నాడు.

ఆ మాటకు సభికుల హర్షధ్వానాలతో సభ మారుమోగింది.



# చందమామ క్విజ్ - 12

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.***

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

మన దేశం **2008**లో సాధించిన కొన్ని గొప్ప కార్యాల గురించి, వ్యక్తుల గురించి మనకు ఎంతవరకు తెలుసో ఈ నెల క్విజ్ ద్వారా తెలుసుకుందాం.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు **50** రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు ( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్ - **12** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. జనవరి నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. మార్చి నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.




1. మన దేశంలో మొట్టమొదటి 'గ్రీన్‌ఫీల్డ్ ఎయిర్‌పోర్ట్' ఎక్కడ నిర్మించబడింది?
2. అక్టోబర్ 12వ తేదీ సిస్టర్ అల్ఫోన్సాకు సెయింట్‌హూడ్ ఇవ్వబడింది. కేరళలో ఆమె జన్మస్థానం ఏదో తెలుసా?
3. 4వ కామన్వెల్త్ యూత్ గేమ్స్‌లో ఇండియా అత్యధిక పతకాలను సాధించింది. ఇండియా సాధించిన పతకాలు ఎన్ని? వాటిలో బంగారు పతకాలు ఎన్ని?
4. భారతీయ దంపతులు 2008 రెమాన్‌మెగసెసే అవార్డును గెలుచుకున్నారు. వారు ఎవరు?
5. ఒలింపిక్ క్రీడలలో మొట్టమొదటి వ్యక్తిగత అవార్డును సాధించిన భారతీయ క్రీడాకారుడు ఎవరు? ఏ క్రీడలో?
6. మన దేశ ప్రథమ ఫీల్డ్ ఎయిర్ మార్షల్ కీర్తిశేషుడయ్యాడు. ఆయన పేరేమిటి?

# PANGAA GANG



అడవుల నిర్మూలన అంటే ఏమిటి?

చెట్లను నరుకుతూ అటవీ ప్రాంతాన్ని తగ్గించడాన్ని అడవుల నిర్మూలన అంటారు.

అడవుల నిర్మూలన ఎందుకు జరుగుతోంది?

జనాభా పెరిగే కొద్దీ నివాసాల స్థలాలకు, ఫ్యాక్టరీలు నిర్మించడానికి, వ్యవసాయ భూములకు అడవులను నిర్మూలించడం జరుగుతోంది.

అడవుల నిర్మూలనకు కారణాలు ఏవి?

అడవుల నిర్మూలనకు అనేక కారణాలు ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి కొన్ని:

- కొయ్య సామానులు తయారుచేయడానికి; కాగితం కోసం.
- విలువైన ఖనిజాలకోసం, పెట్రోలు కోసం భూమిని తవ్వడం.
- భూమి అభివృద్ధి; ప్రజాయుద్ధాలు; ప్రకృతి వనరుల కొరత.

ప్రపంచంలో కెల్లా అతి పెద్ద వర్షపాతంగల అడవులు (పెద్దవి చిన్నవి వరుసక్రమంలో):

- దక్షిణ అమెరికాలోని అమేజాన్ బేసిన్.
- మధ్య ఆఫ్రికాలోని కాంగో రివర్ బేసిన్.
- ఆగ్నేయాసియా
- న్యూ గునియా
- మడగాస్కర్

కొన్ని వాస్తవాలు:

- చెట్లు పడగొట్టడం ఆపకపోతే చెట్లు ఉండవు; జంతువులు ఉండవు. ప్రకృతి జీవకోటికి ప్రతికూలంగా మారిపోతుంది.
- రోజుకు సగటున 137 జాతుల ప్రాణులు అంతరించి పోతున్నాయి. అంటే యేడాదికి దాదాపు 50,000 జాతులన్న మాట.

అడవుల నిర్మూలన మనకెందుకు హానికలిగిస్తుంది?

- మొక్కలు, కీటకాలు, జంతువులు అంతరించి పోతాయి.
- ప్రాణికోటి సహజ ఆవాసాలకు అంతరాయం కలిగిస్తుంది.
- మొక్కలు, చెట్లు తొలగించబడినట్టయితే, వర్షపునీరు పైపొరలోని సారవంతమైన మన్నును కొట్టుకు పోతుంది.
- నీటిమట్టం పెరుగుతుంది. అది వెల్లువలకు దారితీస్తుంది.
- వాతావరణం పొడిగానూ, వేడిగానూ, మరీ చల్లగానూ మారిపోతుంది.
- మామూలుగా చెట్లు బొగ్గపులుసువాయువును గ్రహించి ప్రాణవాయువును వెలువరిస్తూ ఉంటాయి. అయితే, తక్కువ చెట్లు మాత్రమే ఉన్నప్పుడు, పరిసరాలలోకి అమితమైన బొగ్గపులుసువాయువు విడుదల అవుతుంది. ఆ విధంగా శ్వాసకోశ సంబంధమైన సమస్యలు తలెత్తుతాయి.
- నేల, నీరు, గాలి కలుషితమవుతాయి.

అందువల్ల అడవుల నిర్మూలన ఆపడానికి మీరేం చేయాలి?



**www.pangaagang.com** లాగ్ఆన్ చేయండి. అడవుల నిర్మూలనకు వ్యతిరేకంగా పోరాడుతున్న పాంగా గ్యాంగ్‌తో చేతులు కలపండి!!

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

మన పరిసరాలు

## ఈదే అస్థిపంజరాలు




సముద్ర గర్భంలో నేల మీద పెరిగే నాచు మొక్కలుగా భావించి కొన్ని శతాబ్దాలుగా ప్రజలు స్పాంజీలను ఉపయోగిస్తున్నారు. ఈ స్పాంజీలు శ్వాసిస్తాయనీ, ఆహారం తీసుకుంటాయనీ శాస్త్రవేత్తలు కనుగొనడం వల్ల వీటిని ప్రాణులుగా గుర్తించారు. ఒక విధంగా ఇవి ఈదే అస్థిపంజరాలు!

ఒక స్పాంజిని ముక్కలుగా కత్తిరించినట్టయితే, ఒక్కొక్క ముక్కా విడిగా దానంతట అది పెరగడం గమనించవచ్చు. వింతగా ఉంది కదూ? అయినా ఇది నిజం!

స్పాంజీలలో చాలా రకాలు ఉన్నాయి. కొన్ని చిన్నవిగానూ, చాలా మృదువుగానూ ఉంటాయి. మరికొన్ని పెద్దవిగానూ, గట్టిగానూ ఉంటాయి. అవి విభిన్న ఆకారాలతో, రంగులతో పెరుగుతాయి.

విజ్ఞాన వీచికలు :

## మీరే దిక్సూచిని తయారు చేసుకోవచ్చు



రాత్రుల్లో విమానాలు, నౌకలు దిశలను ఎలా గుర్తిస్తాయని మీలో చాలా మందికి అనుమానం కలగవచ్చు. అవి అందుకు అయస్కాంత దిక్సూచిని ఉపయోగించు కుంటాయి. మీరూ కావాలంటే సొంతంగా దిక్సూచిని తయారు చేసుకోవచ్చు. అందుకు మీకు కావలసిందల్లా 3 సెం.మీ. పొడవుగల ఒక సూది; చిన్న ముక్క బార్ మేగ్నెట్ అంటే అయస్కాంతం; చిన్న కార్క్ ముక్క; గిన్నెలో కొద్దిగా నీళ్ళు. మొదట కార్కు నుంచి రూపాయి నాణమంత భాగాన్ని కత్తిరించుకోండి. అందులోకి సూదిని గుచ్చి అమర్చండి.

ఆ తరవాత బార్ మేగ్నెట్ ఉత్తర ధ్రువాన్ని దిక్సూచి రెండు సూది కొసల వద్దకు తీసుకురండి. మామూలుగా ఉత్తర ధ్రువాన్ని తెల్లటి చుక్కతో గుర్తిస్తారు. దిక్సూచి సూది ఏ కొస దూరంగా నెట్టబడుతుందో అది ఉత్తర దిక్కు. దానిని 'ఉ' అని గుర్తించండి.

తేలే సూది నీటి మట్టానికి సమాంతరంగా ఉండే విధంగా దానిని నీళ్ళ గిన్నె మీద అమర్చండి. ఉత్తరం-దక్షిణం దిశగా సూది తేలుతుంది. ఉత్తర దిక్కు తెలిసి పోయింది గనక, తక్కిన మూడు దిక్కులను సులభంగా గుర్తించవచ్చు.

# ఫోటో వ్యాఖ్యల పోటీ


MAHANTESH C. MORABAD

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


MAHANTESH C. MORABAD



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు మార్చ్ 2009 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

. ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ - 600 041

## అభినందనలు

నవంబర్ నెల పోటీ ఫలితాలు
ఎస్. శ్రావ్య
తం.పే: ఎస్. జయసింహరావు
5-64, క్రాస్-సౌత్
భారతంమిట్ట, పాకాల - 517 112
చిత్తూరు జిల్లా (ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: కలిసి ఉంటేనే అందం!
రెండవ ఫోటో :పంచుకుంటేనే ఆనందం!!

## సమాధానాలు :

1. బాలగంగాధర తిలక్ 2. భారత్ భారతి 3. శంకర కురూప్ (మలయాళ కవి) 1954లో 4. విష్ణుశర్మ; క్రీ.పూ. 200 5. విజయ్ టెండూల్కర్ 6. ఒన్ మోర్ ఓవర్ 7. గీతాంజలి 1913 8. అబుల్ ఫాజల్ 9. మహమ్మద్ ఇక్బాల్.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. Editor : B. Viswanatha Reddi (Viswam)

# Going over the moon will cost more soon!!!

Chandamama

## Grab your ride today!

# Subscribe NOW

**Offer valid till 31st January 2009**

We have decided to extend the offer on public demand.

**You Save!**

| | Period | Current Rate | Offer Rate (Rs.) | Proposed Rate from January | You Save! |
|---|---|---|---|---|---|
| English | 1 Year | 180 | 180 | 300 | 120 |
| | 3 Years | 540 | 460 | 800 | 340 |
| | 5 Years | 900 | 675 | 1200 | 525 |
| Regional | 1 Year | 180 | 180 | 240 | 60 |
| | 3 Years | 540 | 460 | 675 | 215 |
| | 5 Years | 900 | 675 | 1000 | 325 |

**CHANDAMAMA**

I want to subscribe / gift to the following editions of Chandamama

(Tick whichever is applicable):

English ☐ Language ....................☐ Junior Chandamama ☐

Name: ..........................................................................................

Date of Birth: .................................. Sex :....................................

Address: .......................................................................................

.....................................................................................................

.....................................................................................................

...................................................... City: ..................................

State:........................................ Pin:...........................................

Telephone:.....................................................................................

Mobile:..........................................................................................

Email:............................................................................................

Gift Subscription to the following address:

.....................................................................................................

.....................................................................................................

.....................................................................................................

.....................................................................................................

Enclosed Cheque/DD* for Rupees..................................................

Cheque/DD No ...........................................................................

favouring Chandamama India Ltd on...............................................

.........................................................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sandeep Avenue East, 2nd Main Road
Chinna Neelankarai, Chennai - 600041. Phone: (044) 32402323
Email: subscription@chandamama.com
You can also subscribe online at:
www.chandamama.comt






## పి సి ఆర్ ఎ సైట్ సర్ఫ్ చెయ్యండి

## పి సి ఆర్ ఎ. కార్యకలాపాలు కనుగొనండి!

మోహన్ వెబ్ సర్ఫ్ చేస్తున్నప్పుడు అతడి స్నేహితుడు యశ్వంత్ వచ్చాడు. "పి సి ఆర్ ఎ అంటే ఏమిటి?" అని అడిగాడు.

"పెట్రోలియం కన్సర్వేషన్ రీసర్చ్ అసోసియేషన్ సంక్షిప్తరూపమే పి సి ఆర్ ఎ ఇది పెట్రోలియం అండ్ నేచురల్ గ్యాస్ మినిస్ట్రీకిందపని చేస్తుంది. పెట్రోలియం పరిరక్షణకోసం దేశవ్యాప్తంగా ప్రజల మధ్య అవగాహన పెంచడానికి ఈ సంస్థ ప్రచారం చేస్తుంది," అని వివరించాడు మోహన్.

"అలాగా!" అని ఆశ్చర్యపోయాడు యశ్వంత్.

"యేటా జనవరి 15వ తేదీ నుంచి 31వ తేదీ వరకు పి సి ఆర్ ఎ ఆయిల్ అండ్ గ్యాస్ కన్సర్వేషన్ ఫోర్ట్‌నైట్ (ఒజిసిఎఫ్) జరుపుతుంది. పెట్రోలియం అండ్ నేచురల్ గ్యాస్ మినిస్ట్రీ మార్గదర్శకత్వంలో పి సి ఆర్ ఎ, పబ్లిక్ సెక్టార్ ఆయిల్ అండ్ గ్యాస్ కంపెనీలతో కలిసి దీనిని జరుపుతుంది. ప్రజల మధ్య స్పృహను పెంచడానికి ఇది ఎంతయినా ఉపయోగపడుతోంది," అన్నాడు మోహన్.

"అవునవును. ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది. గత జనవరిలో వాళ్ళు జరిపిన ఒక చిత్రలేఖనం పోటీలో నేను పాల్గొన్నాను. 'మెరుగైన జీవనానికి చమురు-గ్యాస్ పొదుపు చేద్దాం!' అన్నది పోటీ అంశం," అన్నాడు యశ్వంత్.

"ఒక్క చిత్రలేఖనం పోటీలే కాదు. పెట్రోలు పదార్థాల పొదుపు గురించి సామాన్య ప్రజలకు స్లోగన్ రైటింగ్ పోటీలు, సైకిల్ ర్యాలీ వంటివి కూడా నిర్వహిస్తారు. మన పెట్రోలు నిలవలు రోజురోజుకూ తగ్గిపోతున్నాయి. పి సి ఆర్ ఎ అందించే సూచనలు పాటించినట్టయితే, సరఫరా చిరకాలం కొనసాగేలా జాగ్రత్తపడవచ్చు," అని చెప్పాడు మోహన్.

"బావుంది. మనం వాటిని గురించి ప్రజలకు తెలియచెప్పాలి," అన్నాడు యశ్వంత్.

"చక్కటి స్పృహ ఉంటే ఎక్కువ పెట్రోలును ఆదా చేయవచ్చు. పెట్రోలు పదార్థాలు 2% పొదుపు చేసినట్టయితే, యేడాదికి 10,000 కోట్ల రూపాయలు ఆదా చేయవచ్చు," అంటూ నవ్వాడు మోహన్.

**ఇంధనం పొదుపుకు కొన్ని చిట్కాలు:**

- సరైన ఇంధనశక్తిని పొందడానికి వాహనాలను గంటకు 40-50 కి.మీ. వేగంతో నడపండి.
- మీ కారును 'కార్‌పూల్స్' ద్వారా షేర్ చేసుకుంటూ ఇంధనాన్ని, డబ్బును ఆదా చేయండి.
- ట్రాఫిక్‌లో రెడ్ సిగ్నల్ లైట్లవద్ద 15సెకనుల కన్నా ఎక్కువ సేపు ఆగవలసివస్తే ఇంజన్ను ఆఫ్ చెయ్యండి. అందువల్ల ఇంధనం పొదుపుచేయవచ్చు. పర్యావరణాన్ని పరిరక్షించుకోవచ్చు.

CHANDAMAMA (Telugu) January 2009 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08



# బుబ్బా సాహసాలు




























